# విజ్ఞానసరస్వతి

Volume - 5 July - December 1988 No. 3

# VIJNANA SARASWATI

A Half Yearly Oriental Reasearch Journal in Telugu




Chief Editor

Dr. V.V. Krishna Sastry, M.A. Ph.D.
Director
The Andhra Pradesh Government
Oriental Manuscripts Library &
Research Institute, Hyderabad - 1

# విజ్ఞాన సరస్వతి

# VIJNĀNA SARASWATI

A Half Yearly Oriental Reasearch Journal in Telugu

*The Andhra Pradesh Government*

*Oriental Manuscripts Library & Research Institute.*

Editor

**Dr. S. Radha Krishna Sastry,** M.A.M.O.L. Ph.D.

**D.K. Srinivasa Chary,** M.O.L.







Chief Editor

**Dr. V.V. Krishna Sastry,** M.A. Ph.D.

Director

**The Andhra Pradesh Government**

Oriental Manuscripts Library &

Research Institute, Hyderabad - 1

**Volume 5**
**Number 3**

July - December
1988

*VIJNANA SARASWATI*

A Half Yearly Oriental Reasearch Journal
in Telugu

**Volume 5 Number 3** July - December 1988
Copies - 500




**Single Copy : Rs. 10/-**

**Published by**
THE ANDHRA PRADESH GOVERNMENT
Oriental Manuscripts Library and Research Institute,
Abids, Hyderabad - 500 001, India.

Printed at : **VIJAY MANOHER OFFSET PROCESS**
1-10-212/2/A
Ashok Nagar, Hyderabad



# విషయ సూచిక

పు

# మేఘసందేశము

## ద్వితీయ సర్గ

**శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి**

( గత సంచిక తరువాయి )

44. త్వా మాలిఖ్య ప్రణయ కుపితాం ధాతురాగైః శిలాయాం
ఆత్మానం తే చరణ పతితం యావ దిచ్ఛామి కర్తుం
అస్రైస్తావ న్ముహు రుపచితైః దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మిన్నపి న సహతే సంగమం నౌ కృతాంతః॥

ప్రేమామర్షగ నిన్ను రాతిపయి నిచ్చో ధాతురాగంబులన్
నే జిత్రించియు నన్ను నీదు చరణాలన్ బడ్డటుల్ వ్రాయబోన్
కన్నీర్ మాటికి గ్రమ్మి చూపులను నడ్డుంగా కటా! నెచ్చెలీ
క్రూరుం డోర్వడు దైవమున్ మనదు సంగంబున్ పటంబందు నేన్

45. మామాకాశ ప్రణిహిత భుజం నిర్దయాశ్లేష హేతోః
లబ్ధాయా స్తే కథమపి మయా స్వప్న సందర్శనేషు
పశ్యంతీనాం నఖలు బహుశోన స్థలీదేవతానాం
ముక్తాస్థూలా స్తరుకిసలయేషు అశ్రులేశాః పతన్తి॥

స్వప్నంబందున నెట్టులో దొరకు నిన్నున్ నిర్దయాశ్లేషమున్
గావింపంగను నింగిశూన్యతలి కల్లన్ బాహులన్ జాచు నన్
వీక్షించే వనదేవతల్ తరుచు ముక్తాస్థూలముల్ బాష్పపున్
బిందుల్ చెట్ల చిగుళ్లపై విడువకుండన్ వేరుగా జాలిమై.

46. భిత్వా సద్యః కిసలయపుటాన్ దేవదారు ద్రుమాణాం
యే తత్ క్షీరస్రుతి సురభయో దక్షిణేన ప్రవృత్తాః
ఆలింగ్యంతే గుణవతి మయా తే తుషారాద్రి వాతాః
పూర్వం స్పృష్టం యది కిల భవే దంగ మేభి స్తవేతి॥

భేదిం చప్పుడె దేవదారుతరులన్ త త్పల్లవంపున్ పుటుల్
త క్షీరస్రుతి సౌరభంబు గొనుచీ శీతాద్రి వాతంబు లీ
యామ్యాశన్ జనుదెంచుచో యవి యటన్ నీ యంగము న్నంటియే
వచ్చుంగా యని కౌగలింతు నిట వానిన్, సద్గుణాలంకృతీ.

47. ధారాసిక్త స్థలసురభిణః త్వముఖస్యాస్య బాలే
దూరీభూతం ప్రతనుమపి మాం పంచబాణః క్షిణోతి,
ఘర్మాంతే వై వద ఖత కథం వాసరాణి వ్రజేయుః
దిక్సంసక్తా ప్రవిరళ ఘనావ్యక్త సూర్యాతపాని

ధారాసిక్తమహీసుగంధ మది బాలా! నీ ముఖాబ్జంబుకున్
దూరీభూతుడనై కృశించినను పంచేషుండు న న్నేచెడిన్
ఘర్మాంతంబున కారుమబ్బు లినుడున్ జూపట్టకుండన్ దిశల్
గ్రమ్మన్ దట్టముగాని కెట్లు దినముల్ పోద్రోతు హా చెప్పుమా.

48. సంక్షిప్యేత క్షణ ఇవ కథం దీర్ఘయామా త్రియామా
సర్వావస్థా స్వహరపి కథం మందమందాతపంస్యాత్
ఇత్థం చేత శ్చటులనయనే! దుర్లభప్రార్థనం మే
గాఢోష్ణాభిః కృత మశరణం త్వ ద్వియోగ వ్యథాభిః

సంక్షిప్తల్ క్షణమట్లు లౌల్తను త్రియామల్ దీర్ఘ యామల్ సదా
మందంమందపు టెండలే పగళు లందున్ గాయుగా తంచునున్

హా! గొంతెమ్మపు కోర్కెలన్ చటులనేత్రీ! నాదు చేతంబు ది
క్కెందున్ గానదు నీ వియోగపు వ్యథల్ గాఢోష్ణముల్ వేపగన్

49. న త్వాత్మానం బహు విగణయన్ ఆత్మనై వావలంబే
తత్ కల్యాణి త్వమపి నితరాం మగమః కాతరత్వం
కస్యైకాంతం సుఖముపనతం దుఃఖ మేకాంతతో వా
నీచై ర్గచ్ఛ త్యుపరి చ దశా చక్ర నేమిక్రమేణ॥

ఏ వే వో తలపోతలన్ నిలుపు కొందున్ నేనె నా ప్రాణముల్
ఓ కల్యాణిరో! నీవునున్ కరము భీతిన్ జెందగా బోకుమా
సౌఖ్యంబేనియు దుఃఖమేనియు స్థిరం బెవ్వారి కబ్బున్ చెలీ?
క్రిందున్ మీదును జెందుగా దశలు చక్రావళి ప్రక్రియన్॥

50. శాపాంతో మే భుజగశయనాత్ ఉత్థితే శార్ఙ్గపాణౌ
శేషాన్ మాసాన్ గమయ చతురో లోచనే మీలయిత్వా
పశ్చా దావాం విరహగణితం తం త మాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణత శరశ్చంద్రికాసు క్షపాసు

శాపాంతంబగు నాకు విష్ణు డహిశయ్యన్ వీడు నేకాదశిన్
నాల్గౌ తక్కిన నెట్లొ త్రోయుమి నెలల్ హా! మూసికొంచున్ కనుల్
తర్వాతన్ విరహంబులో మనము నే యే స్వప్నముల్ గంటిమో
వానిన్ వానిని తీర్చుకొందము శరత్ ప్రౌఢక్షపాజ్యోత్స్నలన్.

51. భూయ శ్చాహ త్వమపిశయనే కంఠలగ్నా పురా మే
నిద్రాం గత్వా కిమపి రుదతీ సస్వరం విప్రబుద్ధా
సాంతర్హాసం కథిత మసకృత్ పృచ్ఛతశ్చ త్వయా మే
దృష్టః స్వప్నే కితవ! రమయన్ కా మపి త్వం మ యేతి

ఇంకన్ జెప్పెను మున్ను పాన్పుపయినన్ నా కంఠలగ్నంబవే
యై నిద్రించుచు బిగ్గ నెందులకునో రోదించుచున్ లేచితా
పల్మార్ నే నడుగంగ చెప్పితిటు సాంతర్హాసవై — మోసగా
డా! నీ వెవ్వతె తోనొ పోవుట కలన్ నే గంటి నంచున్ చెలీ

52. ఏతస్మాన్మాం కుశలిన మభిజ్ఞాన దానాద్వి దిత్వా
మాకౌలీనా దసిత నయనే మయ్య విశ్వాసినీభూః
స్నేహానాహుః కిమపి విరహే ధ్వంసిన స్తేత్వ భోగా
దిష్టే వస్తున్యు పచితరసాః ప్రేమరాశీ భవన్తి ॥

ఈ గుర్తుల్ మదినెంచి నన్నుకుశలిన్‌గా నీ వెరుంగన్ దగున్
లోకుల్ కాకులు నమ్మకీ వసితనేత్రీ వారిలొ కూతలన్,
స్నేహంబుల్ చెడు విప్రయోగమున నం ద్రేమో అభోగంబునన్
పెంపై తృష్ణయు నిష్టవస్తువు నెడన్ పెనురాసులౌ స్నేహముల్.

(ఇంకావుంది

# జక్కన విక్రమార్కచరిత్ర

# కథలు - మూలము

## డాక్టర్ నీరజాచక్రవర్తి

ప్రాచీనాంధ్ర కథా కావ్యములలో మూడవదగు విక్రమార్క చరిత్ర మందలి కొన్ని కథలకు మూలము లనదగిన కొన్ని కథలు క్షేమేంద్రుని 'బృహత్కథామంజరి' [1]యందును సోమదేవుని 'కథాసరిత్సాగరము' నందును[2] గోచరించుచున్నవి. వీరిద్దరిలో క్షేమేంద్రుడు పూర్వుడు. వీరిద్దరి రచనలకును ఆకరము ఒకటైయై యుండును. క్షేమేంద్రుని కొన్ని కథలకు కథాసరిత్సాగరమున విస్తృతి కనిపించుచున్నది. ఇవిగాక యాంధ్ర దేశమున దనకాలమున ప్రచారములో నున్న విక్రమార్క కథలను గూడ జక్కన తన కావ్యమునందు జేర్చి యుండునని ఊహించుచున్నారు.[3] ఇందలి కథలకు సంస్కృత విక్రమార్క చరిత్రమున సూచనలు గాన వచ్చినను. జక్కన విక్రమార్క చరిత్రము అనువాదముగాక చాల వరకు స్వతంత్ర గ్రంథమై యొప్పుచున్నదనుటయే వాస్తవము.

జక్కన విక్రమార్క చరిత్ర మెనిమిదా శ్వాసముల మహాకావ్యము. ఇందు విక్రమార్క చక్రవర్తి సాహస పరాక్రమౌదార్యాదులను వివరించు నద్భుత కథ లిరువది రెండున్నవి. ఆశ్వాసాను సారముగ నిందలి కథల వివరణ మిది;

ప్రథమాశ్వాసము :-

1. కథానాయకకుడనదగు విక్రమార్కుడు, అతని సోదరులగు వరరుచి, భట్టి, భర్తృహరి యను వారి జన్మవృత్తాంతము, వారు యుక్తవయస్కులైనంతనే వారి తండ్రి యగు చంద్ర గుప్తుడు రాజ్యమును విక్రమార్కున కభిషేకించుట యిందలి కథ.

---

1. బృహత్కథామంజరి - అనువాదము : శ్రీ తిరుమలరామచంద్ర.
2. ఆంధ్ర కథాసరిత్సాగరము - అనువాదము శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి
3. ఆంధ్ర సాహిత్య చరిత్ర — జక్కన కవి. పుటలు 465

ద్వితీయశ్వాసము :-

2. సుబల మహాబలులను రక్కసులను వంచించి దివ్య ప్రభావము గల యోగదండము, పాదుకలు, రత్నపాత్ర, దివ్యకంథ-వీనిని విక్రమార్కుడు సంపాదించుట,

3. యోగదండము మహిమ వలన మేరువు సమీపమున చంద్ర పురమును నిర్మించి పాలించుట.

4. పాదుకల సహాయమున సత్యలోకమునకేగి బ్రహ్మను మెప్పించి బ్రహ్మాస్త్రాదుల బడయుట.

5. ఉట్టి చేర్లను తెగవేసి, కాళికాదేవిని మెప్పించి, భట్టితో గూడ ఉజ్జయినీ రాజ్యమును వేయేండ్లు పరిపాలించునట్లు వరమును, సాహసాంకుడను బిరుదమును బడసి విక్రమార్కుడు ఉజ్జయినికి రాజగుట.

6. ఇంద్రాహ్వానమున నాకమునకేగి రంభోర్వశుల నాట్య తారతమ్యముల జెప్పి, ద్వాత్రింశత్సాలభంజికా రంజితమగు దివ్య సింహాసనమును బహుమతిగ బడసి దాని నధిష్ఠించి రాజ్యమేలుట.

7. విక్రమార్కుడు కనకస్తంభము నెక్కి సూర్యమండలమునకేగి సూర్యుని వలన బంగారు నొసగు రత్నకుండలముల బడసి వచ్చి వానిని తన్నర్థించిన బ్రాహ్మణున కిచ్చుట.

8. మాయా వరాహమును వెంబడించిన విక్రమార్కుడు పాతాళమున కేగి బలి చక్రవర్తి యాతిథ్యమును స్వీకరించి, యాత డొసగిన రస రసాయనములు తన్నర్థించిన విప్రున కిచ్చుట.

9. మధురకేగి రక్కసునితోజేతి కమలావతి యను నచ్చరను రక్షించి, యామె వలన బడసిన దివ్యమణిని పురందరుండను వైద్యున కిచ్చుట.

తృతీయశ్వాసము :-

10. భార్య వంచించుటచే విరక్తుడైన భర్తృహరి తపమునకేగ నిశ్చయించుట.

11. భర్తృహరి విక్రమార్కునకు జెప్పిన బహుశ్రుతుడను మంత్రి కథ.

21. శారిక చెప్పిన ధనగుప్తుని కథ.

**అష్టమాశ్వాసము -:**

22. మూడవమారు కళావతిని పల్కించుటకై సువర్ణ కలశముచే విక్రమార్కుడు చెప్పించిన పద్మావతి, గుణావతి, లీలావతి యను నక్కచెల్లెండ్ర విశృంఖల శృంగారమునకు సంబంధించిన కథ.

ఇక విక్రమార్క చరిత్రలోని కథలకు మూలములని భావింపబడుచున్న బృహత్కథా మంజరి, కథాసరిత్సాగరము, సంస్కృత విక్రమార్క చరిత్రలలోని కథలను జక్కన కథలతో బోల్చి చూతము.

**భేతాళుని కథ -:**

ఇది క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథల నుండి సంగ్రహింపబడినది. విక్రమ సేనుడను రాజునకు మౌనభంగము కల్గుటకై బేతాళుడు చెప్పిన కథయిది.[4] ఈ కథయే కొన్ని మార్పులతో కథాసరిత్సాగరమున నున్నది.[5]

పాటలీపుర రాజు విక్రమకేసరి. ఆతని పుత్రుడు పరాక్రమకేసరి, అతని యొద్ద సర్వశాస్త్రపాండిత్యముగల చిలుక యొకటి యుండెను. ఒకనాడు రాకుమారుడు వినోదార్థము 'నాకెవతె భార్య యగు' నని చిలుకనడుగ, నది 'మగధాధి పతియగు చంద్రావలోకుని కుమారై చంద్రప్రభ నీకు భార్యయగు' నని చెప్పెను. ఆమె సౌందర్య వర్ణనము విన్న పరాక్రమకేసరి మన్మథ వికారమునకు లోనయ్యెను. ఆ మగధ రాజకుమారి యొద్ద సోమిక యను నొక గోరువంక యుండెను. అది పై చిలుక కన్ని విధముల సమానమైనది. అది సల్లాప సందర్భమున 'పాటలీపుత్ర రాజకుమారుడగు పరాక్రమ కేసరియే నీకు భర్తయగు' నని చంద్ర ప్రభకు జెప్పెను, రాకుమారియు విరాళి బడినది. పాటలీపుత్ర రాజు తన పుత్రుని కోర్కెను మగధ రాజునకు దెల్పి, యాతని పుత్రికనిమ్మని యడిగి యిర్వురకును

4. ఆంధ్ర సచిత్ర వారపత్రిక - 30-1-1970
5. ఆంధ్ర కథాసరిత్సాగరము - సంపుటము 5—పుటలు 1442-1450

చతుర్థాశ్వాసము :-

12. నారదముని యాదేశమున విక్రమార్కుడు సిద్ధపుర రాజగు శకుని సంహరించి, విదర్భరాజ పుత్రిని వివాహమాడుట.

పంచమాశ్వాసము :-

13. విక్రమార్కుడు చిత్రకూటాద్రికేగి కాళికను మెప్పించి మౌనమునికి వరము లిప్పించుట.

14. విక్రమార్కు డశ్వమేధము చేయుట, సముద్రుడు కానుకగా బంపిన నాల్గు దివ్య రత్నములను విప్రున కిచ్చుట.

15. విక్రమార్కుని గుణ పరీక్షకు సంబంధించిన దేవ దత్తుని కథ.

16. నరమోహిని యను వారనారిని రక్కసుని బారి నుండి రక్షించిన విక్రమార్కు డామెను కమలాకరునకు వివాహము చేసిన కథ.

షష్ఠాశ్వాసము -:

17. మౌనవ్రతియగు కళావతియను పాతాళ రాజకన్య వృత్తాంతము.

18. కళావతికి మౌనభంగము చేయుటకై విక్రమార్కుడు దీపకంబముచే జెప్పించిన కామమంజరి కథ.

సప్తమాశ్వాసము -:

19. కళావతి మౌన భంగమునకై విక్రమార్కుడు కర్పూరకరండముచే జెప్పించిన రాజశేఖరుని కథ. పైదాని కనుబంధముగ చిలుక గోరువంకల కలహమున బుట్టిన కథలు రెండు.

20. చిలుక చెప్పిన విలాసవతి కథ.

పెండ్లి చేసెను. ఆ శుకశారికలు రెండును నొక్క పంజరముననే వసించి తమ విజ్ఞానముచే నాదంపతుల గొలుచు చుండెను.

ఒకనాడు చిలుక గోరువంకపై మరుల్గొని తన్ను గూడుమని శారికను వేడెను. 'పురుషులు దుష్టులు, కృతఘ్నులు గాన నీ సంపర్కము నే నొల్ల' నని శారిక తిరస్కరించెను. 'స్త్రీలే దుష్టులు. క్రూర హృదయ' లని చిలుక యనెను, రెంటికిని వివాదము పెరిగెను. తమ రెంటిలో నేది చెప్పినది సరియైనను రెండవది మొదటి దానికి దాస్యము చేయవలె ననెను పందె మేర్పరచుకొని. యవి రెండును చంద్రప్రభా పరాక్రమ కేసరులను మధ్య వర్తులుగ నుండుమని గోరుచు రెండు కథలు జెప్పినవి.

**శారిక చెప్పిన ధన దత్తుని కథ :-**

కామందికయను పట్టణమున నర్థదత్తుడను వైశ్యునకు ధనదత్తుడను పుత్రుడుండెను. తండ్రి యనంతర మాతడు జూదము లాడి బికారియై స్వదేశము వదలి, చంద్రపురమున కేగెను. అట హిరణ్యగుప్తుడను వైశ్యునింటికి భోజనార్థము పోయెను. ఆతడు ఇతని వివరము లరసి కులీనుడని తెలిసికొని, ధనములతో గూడ తన కుమారై రత్నావతి నిచ్చి వివాహము జేసెను. ధనదత్తుడు కొంత కాలము మామ యింటనే దారిద్ర్యము మరచి సుఖముండెను. జూదములపై మనసు పడుటచే స్వదేశమునకు బో సంకల్పించెను, మామ యెంతయో వారించియు నల్లుడు వినకుండుటచే ధనధాన్యాదులతో బాటుగ కూతున కొక ముసలి దాసిని తోడిచ్చి యల్లుని వెంట బంపెను. ఆతడును భార్యా సమేతముగ బోవుచు మార్గ మధ్యమున దొంగ భయమును గల్పించి, భార్య యొద్దనున్న యాభరణముల నన్నింటిని గైకొనెను. పిమ్మట ముసలి దానితో బాటుగ భార్య నొక ఘన కూపమున ద్రోచి వెడలిపోయెను. ముసలిది వెంటనే మరణించెను. రత్నావతి యెట్లో పైకెక్కి వచ్చి వెదికి కొనుచు తండ్రి గృహమున కేగినది. భర్తను దొంగ లెత్తికొని పోయిరని బొంకి తండ్రిని సమాధాన పరచెను. కొంత కాలము గడచినది. ధన మంతయు ఖర్చుపెట్టిన ధనగుప్తుడు భార్య మరణించినదని యబద్ధములాడి మామనుండి ధన సంగ్రహణము జేయ వచ్చునని చంద్ర పురమునకు మరలి వచ్చెను. గృహమున దన భార్యను గాంచినంతనే యాతని గుండె జల్లుమనెను. రత్నావతి తన తండ్రికి జెప్పిన యబద్ధము భర్తకు దెలియజేసి, యాతని చింతను దాత్కాలికముగ దగ్గించెను. ఒకనాటి రాత్రి ధనదత్తుడు తన యొడిలో నిద్రించుచున్న భార్యను జంపి యామె నగలన్నియు గైకొని యెవ్వరికిని దెలియ

కుండ వెడలిపోయెను. కావున నీకథ మూలమున శారిక పురుషులు దుష్టులని తీర్మానించెను. దీనికి సమాధానముగ స్త్రీలు దుష్టులని తెల్పు కథను చిలుక చెప్పెను.

చిలుక చెప్పిన వసుమతి కథ –:

మర్షవతీ పట్టణమునకు రాజు ధర్మనామధేయుడు. ఆ నగరమున ధనగుప్తుడను వర్తకు డుండెను. అతని కుమార్తె వసుమతి భర్త లేనపు డామె యందగాడగు నొక ప్రాయపు మగ వాని గని, చెలికత్తె మూలమున జాటుగా నాతని రప్పించుకొని క్రీడించెను. అది మొదలుగ నావ్యవహారము సాగుచుండెను. సముద్రయానము జేసి వచ్చిన భర్తను గని యామె విటకాని గలియుట కవకాశము లేదని చింతించు చుండెను. భర్త సముద్ర దత్తుడు మద్యపానమత్తుడై శయన మందిరము ప్రవేశించెను. భార్యను కూటమికై వేడ నామె నిదుర నటించెను. భర్త నిద్రించిన వెనుక వసుమతి లేచి సంకేతమునకు బయలుదేరెను. అంతకు ముందే వారి గృహ మును ప్రవేశించిన చోరు డొకడు వసుమతి ప్రవర్తనకు గుతూహలము చెంది యామె వెంట బోయెను. దారిలో నొకసఖి యలంకార ద్రవ్యములతో వసుమతిని గలసెను. ఒక యుద్యాన వనమున కిర్వురునేగిరి. అట వసుమతి కాముకు డొక చెట్టు కొమ్మకు ఉరిలో వ్రేలుచుండెను. వాడు రాత్రియటకు రాగా, తలారులు సందేహించి యురివేసిపోయిరి. వసుమతి మహా దుఃఖ ముతో నాదేహమును దింపి విలపించుచు కౌగిలించి మొగమెత్తి చుంబింపబోగా నాశరీరము నావేశించిన బేతాళు డామె ముక్కు కొరికి వైచెను ఆమె భయపడి గృహమునకు మరలిరాగా, వెంబడించిన చోరుడును మరింత కుతూహలముతో వారి గృహమునకు వచ్చెను. వసుమతి తనభర్త ముక్కుకోసి నాడని యాక్రోశింప, నామె తండ్రి యల్లుని గట్టివేయించి, మరునాడు రాజసభకు గొంపోయెను. రాజంతయు విని యాతనికి మరణ దండన విధించెను. వీధివెంట సముద్ర గుప్తుని వధ్య స్థానమునకు దీసికొని పోవుచుండ చోరుడు వచ్చి యంతయు రాజ భటులకు జెప్పెను. సాక్ష్యముగ శవమునోట ముక్కుండుటచే రాజు సముద్ర గుప్తుని వదలివేసి, వసుమతికి చెవులు సైతము గోయించి నగర బహిష్కృత జేసెను. చోరుడా నగరమునకు దండనాయకుడుగా నియమింపబడెను.

ఈ రెండు కథలను జెప్పిన వెనుక శాపములు దీరిన చిలుక, గోరువంకలు చిత్రసేన గంధర్వుడు, తిలోత్తమయునై స్వర్గమునకు బోయినవి. వాని తగవటనే నిలిచిపోయినది.

విక్రమార్క చరిత్రము నందలి సప్తమాశ్వాసమున గల రాజశేఖరుని కథ, దానికి సంబంధించిన రెండవాంతర కథలును బృహత్కథామంజరి యందలి పైకథ లెంతో బూర్తిగ సమన్వయము గల్గియున్నవి. పరిశీలింపుడు.

రాజశేఖరుని కథ :-

ఆనందక పుర రాజు విక్రమ కేసరి. రాణి ఉమాదేవి వారి పుత్రుడు రాజశేఖరుడు. ఒకనాడు రాజశేఖరుడు వేటాడుచు నొక కాళికా మందిరము నరణ్య మధ్యమున గాంచెను. దేవిని సేవించి యాచెంతనే రాచిల్కతో సంభాషించుచుండిన యొక యోగీంద్ర కాంతను జూచి సమీపించి నమస్కరించెను. ఆ చిలుక యరువది నాల్గు విద్యల నెరవాది, త్రికాలవేది గాన, నది రాజుల కడనే యుండ దగినదని యెరిగి దానిని పంజరముతో గూడ రాజశేఖరుని కిచ్చెను. పిమ్మట నాతడు దేవాలయ సమీప లతా గృహమున విశ్రమించి, తన భావి ఫలప్రాప్తి గూర్చి యా చిలుక నడిగెను. అవంతీ పురాధీశుడగు సత్యధర్ముని పుత్రి కర్పూరమంజరి యాతనికి భార్యయగునని, వైవాహిక వార్త యాక్షణమందే వచ్చునని చిలుక చెప్పుచుండగనే యొక కాంతవచ్చి రాజశేఖరునకు మ్రొక్కి కూర్చుండెను. చిలుకయే యామెనుపలుకరించి వృత్తాంతము జెప్పుమన్న యామె యాశ్చర్య చకితయయ్యెను. పిమ్మట తాను కర్పూరమంజరికి చతురికయను చెలిననియు, శృంగార వనమునకు మన్మథ పూజకై యరిగినపుడు పురాణకథలు చిలుకల సమూహమునకు జెప్పుచుండిన యొకశారిక కర్పూర మంజరికి జిక్కినదనియు, నా శారిక "రాజశేఖరుడు నీకు భర్త కాగల"డని యాతని గుణగణాదులను వర్ణించి చెప్పినంతనే యామె విరహములో బడినదనియు జెప్పెను. కర్పూర మంజరి తల్లిదండ్రుల యనుమతిపై దా నామెను వివాహమాడుమని రాజశేఖరునకు జెప్పుటకు వచ్చితినని కూడ విన్నవించెను. కర్పూర మంజరిపై మరులుగొనియున్న రాజశేఖరుడు నందులకు సమ్మతించి యవంతికేగి, యామె నుద్వాహమై తనపురమునకు వచ్చి సుఖముండెను.

కొంతకాలమునకు చిలుక మన్మథ సామ్రాజ్యము నేలుచున్న కర్పూర మంజరీ రాజ శేఖరులవలె తాముగూడ నుండవలెనను కోరికను శారిక యెద్ద వెలిబుచ్చెను. శారిక పురుషులు కర్కశహృదయులు గాన తాను పురుష సంపర్కము నొల్లనని చిలుకకోరికను తిరస్కరించెను. స్త్రీలే కర్కశహృదయలు; దుష్టులని చిలుక వాదించెను. ఇర్వురవాదమునకును కర్పూరమంజరీ రాజశేఖరులు మధ్యవర్తులైరి. ఓడినపక్షి గెలిచినదాని గూడవలెనను నియమముతో చిలుకయు, గోరువంకయు దమ వాదములకు నిదర్శనముగ రెండు కథలు చెప్పినవి.

విజ్ఞాన విరస్వతి

విధించెను. వధ్యస్థానమునకు సుధర్ముని తలారెకులు దీసికొని పోవుచుండ, మార్గమధ్యమున నొకముని దివ్యదృష్టితో నంతయు దెలిసికొని ఆ రెకులను వారించెను. వారు రాజునకెరిగింప రాజు ముని కడకువచ్చి యంతయు నరసి శవము నోటనున్న ముక్కును గూడ చూచెను క్రోధముతో విలాసవతిని నగరబహిష్కృతగావించి యల్లునకు వేరొకచోట బెండ్లి చేసెను.

పై విక్రమార్క చరిత్ర మందలి కథయును, బృహత్కథామంజరి కథయును మౌన వ్రతభంగము చేయుట కొరకే చెప్పబడినవి. బృహత్కథామంజరియందు విక్రమసేనుడను రాజు మౌనభంగమునకై బేతాళుడు చెప్పెను. విక్రమార్క చరిత్రమునందు కళావతి మౌనభంగము నకై విక్రమార్క భూ విభుడు కప్పురపు బరణిచే జెప్పించెను. బృహత్కథామంజరి యందు రాకుమారునిపేరు పరాక్రమ కేసరి. జక్కన కావ్యమున రాజశేఖరుడు. నాయికల పేర్లను మారినవి. పరాక్రమ కేసరి భార్యచంద్రప్రభ రాజశేఖరుని భార్య కర్పూరమంజరి. నాయకుని యెద్ద జిలుకయు నాయిక కడ గోరువంకయు రెంటను సమానములే. బృహత్కథా మంజరి యందలి సామికయను శారిక పేరు విక్రమార్క చరిత్రమునలేదు. ఈ పక్షులు రెండును నాయికానాయకుల గలపుట కుపకరించినవి. ఈపై కొన్ని సామ్యముల వలన బృహత్కథా మంజరి యందలి కథయే విక్రమార్క చరిత్రమునందలి రాజశేఖరుని కథకు మూలమన వచ్చును. జక్కన దానినే గ్రహించి కొంత పెంచియు, మార్చియు, రచించెను.

తరువాత శారిక చెప్పినకథ :- బృహత్కథా మంజరి యందు కథానాయకుడు ధన దత్తుడు ఆతని భార్య రత్నావతి. జక్కన కావ్యమున నాయికా నాయకులు ధనగుప్త రాగతరం గిణులు. బృహత్కథా మంజరి యందలి ముసలిదాని ప్రసక్తి విక్రమార్క చరిత్రమున లేదు. పైగా ధనదత్తుడు భార్యరత్నావతిని జంపివేసెనని బృహత్కథా మంజరి యందుండ జక్కన ధనగుప్తుడు హత్యాప్రయత్నమున పట్టువడి యిల్లు వెడలగొట్ట బడెనని మార్చెను.

ఇక చిలుక చెప్పిన కథలో నాయిక బృహత్కథామంజరియందు వసుమతి. విక్ర మార్క చరిత్రమున విలాసవతి. వసుమతి భర్త సముద్ర దత్తుడు. విలాసవతి భర్త సుధర్మ భూపతి. వసుమతి భర్తలేనపుడు చాల కాలముగ చాటుమాటు వ్యవహారము సాగించుచుండెను. కాని, విలాసవతికి మాత్రమదే ప్రథమ సంగమము. బృహత్కథా మంజరియందు వసుమతి విటుడు ఉరితీయ బడెను. విక్రమార్క చరిత్రమునందు సర్పదష్టుడాయెను. అందలి చోరుని ప్రసక్తి జక్కన కావ్యమున లేదు. ఒక దివ్యముని యంతయు జిత్తమున గాంచి రాజునకు

శారిక చెప్పిన ధనగుప్తుని కథ:- కాంచనపురమున ధర్మగుప్తుడను వైశ్యపుత్రుడు ధనగుప్తుడు తండ్రి యనంతర మాతడు ధన మంతయును బోనాడి దరిద్రుడై కంచిలోని మేనమామ యింటికేగెను. మేనమామయగు శ్రీగుప్తునితో తండ్రి మరణ వార్తజెప్పకయే రాగతరంగిణి యను నాతని పుత్రికను బెండ్లాడెను. జూదమాడ సంకల్పించి కాంచనపురికేగ వలెనని మామతోజెప్ప, నాతడు ధనధాన్యాదులతో పుత్రికయగు రాగతరంగిణి నాతని వెంట బంపెను. దారిలో నొకపాడు నూతిలోనికి భార్యను ద్రోసివైచి, ధనగుప్తుడు మామ యిచ్చిన ధనమంతయు గైకొని కాంచన పురికేగెను. ఏడ్చుచున్న రాగతరంగిణికంఠ స్వరమును విన్న పథికులామెను పైకితీసి యెట్లు పడితివని యడిగిరి. రాగతరంగిణి వారికి దొంగల గుంపు తమ్ము జుట్టుముట్టి దనభర్త పారిపోయెనని, తానెట్లో తప్పించుకొని దుఃఖముతో కన్నులు గానక యీపాడు నూతిలో బడితినని చెప్పెను. వారామెను పుట్టింట విడిచిపోగా, నామె తండ్రికి గూడ నదే యబద్ధమునుజెప్పి యతనిని సమాధానపరచెను. కొంతకాలమునకు ధనమంతయు జూదమున నాశనము కాగా, భార్య గర్భిణి యని బొంకి యామె సీమంతమునకై ధనము గైకొందమని ధనగుప్తుడు కంచికివచ్చెను. మామ గృహమున నడుగిడగనే భార్య కనిపించగా నాతనికి వణుకు పుట్టెను. రాగతరంగిణి తాను జెప్పిన యబద్ధమును గూర్చి భర్తకుజెప్పి, తాత్కాలికముగ నాతని శాంతపరచెను. కొన్నాళ్లుండి, యొకనా డర్ధరాత్రమున సంభోగపరిశ్రమ స్ఫురణ నంది తన కౌగిట నిద్రించుచున్న భార్యను జంపుటకై ధనగుప్తుడు కఠారమును బూన్చెను. ఆమె మేల్కాంచి యాక్రోశింపగా శ్రీగుప్తుడును, నితరబంధువులును వచ్చి, ధనగుప్తు నిల్లు వెడల నడచిరి.

చిలుక చెప్పిన విలాసవతి కథ:- విక్రమ సింహపుర రాజగు ప్రతాపముకుటుని కుమార్తె విలాసవతి. ఆమె భర్త సుధర్ముడు. ఆమె యొకనాడు నదీతీరమున మన్మథ పూజ చేయుచు, నొకవిప్రకుమారునిగాంచి కామించెను. తన చెలిద్వారా ఆతని నొక సంకేతమునకు రప్పించి, చీకటిపడిన వెనుక నెవ్వరు నరయకుండ నచటకేగెను. ఆమె దురదృష్టవశమున నాతడు పన్నగేంద్రస్ఫుటదంష్ట్రాదష్టుడైమరణించియుండెను. విలాసవతి యతని దేహమును కౌగిట జేర్చి పరిపరి విధముల దుఃఖించు చుండెను. అంతలో నా దేహము భూతావిష్టమై కదలినంత నీ భూసురునకు ప్రాణము వచ్చినదని యామె కరతాడన గళరవముల పరిరంభణ చుంబనముల పైబడి పెనగెను. ఆ భూతము విలాసవతి ముక్కుగొరికి, శవము నోటముక్కు చిక్కినంతనే శవమును వదలిపోయెను విలాసవతి చప్పనాతి వలె గృహమునకు వచ్చి, భర్తయే తనముక్కు గొరికి వేసినాడని యరచుచు నార్భాటముచేసెను. ప్రతాపముకుటు డల్లునకు మరణదండన

లేవు. జక్కన భోజుని, కాళిదాసును, వరరుచి సోదరులగు విక్రమార్క, భట్టి, భర్తృహరులు ముప్వురు నొకచో జేర్చెను. వీరందరును నొకే కాలమున నొక్కస్థానమున నుండుట యసాధ్యమైన విషయము. ఉత్తమశీలములు గలవారందర నొక్కయెడ జేర్చి జక్కన యిట్లు రచించియుండనోపు. నాయకు డుత్తమ వంశజు డనుటకు నిట్లు జేసి యుండవచ్చును.

2. పాటలీపుత్రకకథ[7] :– ముగ్గురన్నదమ్ములు దారుణమైన కాటకము వలని పత్ను లను వదలి దేశాంతరము బోయిరి. ఆ పత్నులలో రెండవయామెకు బుట్టినవాడు పుత్రకుడు. ఆతనిని బార్వతీ పరమేశ్వరులను గ్రహించి సంపన్నుని జేసిరి. కుమారుని సంపన్నత గూర్చి విని తండ్రులు ముప్వురును మరలివచ్చిరి, ఆతని ధనమంతయు దామేయనుభవింప గోరి పుత్రుని జంపుటకు యత్నించిరి. కాళికాదేవి యనుగ్రహమున దప్పించుకొనిన పుత్రకుడు విరక్తి జెంది వింధ్యారణ్యమున కేగెను. అట ముష్టి యుద్ధము జేయుచున్న యిర్వురు పురుషుల గాంచి, వారించి విషయ మడిగెను. వారు మయాసురుని పుత్రులు. మహిమాన్విత ములగు తబిల, కర్ర, పావుకోళ్ల కొరకై పోరాడుచుండిరి. పుత్రికుడు వారిరుపురకును పరుగు పందెమేర్పరచి, వారు పరుగెత్తుచు గొంత దవ్వేగిన పిదప నా వస్తువులు సంగ్రహించి, పావుకోళ్ల సహాయమున నాకాశయానమున పాటలీపుత్రమున కేగెను. ఇంతవరకును నీ కథ విక్రమార్క చరిత్రమందలి కథకు ఆధారమగుచున్నది.

విక్రమార్క చరిత్రమునందలి కథ. దిగ్విజయ తత్పరుడైన విక్రమార్కుడు వింధ్యకేగి వింధ్యవాసినీ దేవిని దర్శించి బయటకు వచ్చెను. ఆలయపరిసరములలో సుబల మహాబలులను నిర్వురు రక్కసులు బోరుచుండిరి.[8] ఆ పోరాటమునకు గారణమైన వస్తువులు నాలుగు. అవి యాకాశయానము చేయు పాదుకలు, వ్రాసినదంతయు నిజముచేయు మంత్ర దండము, విదల్చిన ధనము రాల్చు కంథ, పంచభక్ష్య పరమాన్నములిచ్చు మణి పాత్ర వానిని సంగ్రహింపదలంచిన విక్రమార్కుడు కుహనాచతురుడై వారిని బుజ్జగించి, యిరువురకును పరుగుపందె మేర్పరచెను. వారు కొంతదూర మేగినంతనే పాదుకలు ధరించి, తక్కినవి చేతబట్టి యాకాశమున కేగెను.

7. ఆంధ్ర కథా సరిత్సాగరము-సంపుటము-1, పుటలు 19-27.

చెప్పెను. మరియు ప్రతాప ముకుటుడు కూతు వెడల నడచి, యల్లునకు వేరొక వివాహము గావించినట్లు జక్కన కల్పించెను. ఇట్లు బృహత్కథా మంజరి యందలి యొకకథ జక్కన కావ్యమున గాన్పించు చున్నది.

ఇక విక్రమార్క చరిత్రములోని కథలకు మూలములని భావింపబడుచున్న కథా సరిత్సాగరములోని కథలు రెండు. అవి వరరుచి కథ, పాటలీపుత్రక కథ.

1. వరరుచి కథ[6] కథా సరిత్సాగర మందలి వరరుచి శాపవశమున భూలోకమున జన్మించిన ప్రమథుడు. వసుదత్త సోమదత్తులతని తల్లిదండ్రులు ఈతడు పుట్టగనే లోకమున వ్యాకరణ శాస్త్రమున బ్రతిష్ఠించు ననియు, నేదేది ప్రపంచమున వరమో యదియెట్లు వీనికి రుచించును గాన నతనికి వరరుచి యని పేరనియు నశరీరవాణి పల్కెనట; వరరుచి భార్య ఉపకోశ. వరరుచి మిత్రుడు రాజుకాగా, వరరుచి యాతని మంత్రి యయ్యెను. కొంత కాలమున కితడు విరక్తిచెంది యరణ్యమునకేగి యట శాప విముక్తినంది దివ్యగతి బొందెను.

విక్రమార్క చరిత్రమునందలి వరరుచి కథ :- చంద్రగుప్తుడను బ్రాహ్మణోత్తమునకును శీలవతికి బుట్టినవాడు వరరుచి. తండ్రి యాతనికి జాతకర్మ యొనర్చి జన్మసమయ గ్రహయోగ బలమువలన నాతడు చతుర్దశ సంఖ్య విద్యలలోను వరరుచి యగునని వారి జమిత్రుని వలె వెలుగునని తెలిసికొని వరరుచి యని పేరిడెను. వరరుచి లోకహిత కావ్య రచనా ప్రౌఢి యందును, వేదశాస్త్ర పురాణ వ్యాకరణ సరణి నేకముఖ బ్రహ్మ యని పేర్గాంచెను. భోజ విభుడు మెచ్చునట్లు ప్రాకృత వ్యాకరణాగమమును,సకలలోకోపకారకముగ జ్యోతిశ్శాస్త్రమును జేసెను. కాళిదాసుని నవ్య కావ్య విద్యాప్రౌఢిని వరకవీశ్వర చక్రవర్తిని జేసెను. శారదా తిలకాది ప్రశస్త మంత్రశాస్త్ర సర్వంకష విజ్ఞానమున మించెను. శ్రౌతస్మార్త రహస్యవేదులకు గురుస్థానముగ, మహాకవీశ్వరులకు సాక్షాద్భారతీమూర్తిగ, రాజులకు బూజాలింగముగ వెలసెను. విక్రమార్కునిచే నశ్వమేధము చేయించెను. చంద్రగుప్త భూసురుని వంశకర్తయై వర్తిల్లెను.

కథాసరిత్సాగరమున వరరుచి తల్లిదండ్రులు వసుదత్తా సోమదత్తులు. విక్రమార్క చరిత్రమున శీలవతీ చంద్రగుప్తులు. వరరుచికి సంబంధించిన శాపాది వృత్తాంతము లిందు

6. ఆంధ్రకథాసరిత్సాగరము. సంపుటము-1, పుటలు ; 1-9.

కథాసరిత్సాగరమందలి కథలో పసువులు మూడే. విక్రమార్క చరిత్రమున ధనము నిచ్చు కంథ యధికమై నాల్గు పసువులైనవి. కథాసరిత్సాగరమందు నాయకుడగు పుత్రకుడు ఇక్కడ గాద్యమున విక్రమార్కుడైనాడు. ఈ విధముగ చిరు మార్పులతో కథాసరిత్సాగరమందలి రెండుకథలు మూలముగ విక్రమార్క చరిత్రమున గలవు.

ఇక సంస్కృత విక్రమార్క చరిత్రములోని కథల జాతము. దీని కర్త యెవ్వరో యింతవరకును దెలియ రాలేదు. ఇందలి ముప్పది రెండు కథలలో పదికథలు విక్రమార్క చరిత్రములోని కథలతో బోలికలు గల్గియున్నవి. అవి సమన్వయముతో నీ క్రింద నీయబడినవి.

1. భర్తృహరి వైరాగ్యగాథ :– ఉజ్జయినీ నగరమును భర్తృహరి పాలించుచుండెను. ఆతని తమ్ముడు విక్రమార్కుడు. ఆ నగరమున సకల శాస్త్రాభిజ్ఞుడును, సమస్తమంత్ర శాస్త్ర ప్రవీణుడు నైన యొక దరిద్ర బ్రాహ్మణు డుండెను. అతడు భువనేశ్వరీ దేవిని మంత్రానుష్ఠానముచే ప్రసన్నను గావించుకొని, జరామరణములు తొలగించు ఫలము సంపాదించెను. తినబోవుతరి నాతని మనసిట్లనెను. 'నీవు దరిద్రుడవు. జరామరణములు లేక యెవరి కుపకారము చేయుదువు? భిక్షాటనము దప్ప నీకు వేరుగతి లేదు. కావున, రాజున కిచ్చిన, నాతడు జరామరణవర్జితుడై ప్రజల జక్కగ బాలించును.' ఇది విని యాతడు భర్తృహరి కడకేగి ఫలమిచ్చి, దాని మహిమ దెల్పి, సమ్మానితుడై పోయెను. రాజు కొంతవడి యాలోచించి తన కత్యంతప్రియమైన తనభార్య లేకున్న దానుండియు ప్రయోజనములేదని, యా ఫలమునామె కిచ్చెను. తనకు ప్రియుడగు నొక మందురికుని గూర్చి భర్తృహరి భార్యయు నైవిధముగనే యాలోచించి, యామె యా మందురికున కాఫలమిచ్చెను. ఆతడొక దాసికి, నామెయొక గోపాలునకు, నాతడొక గోమయధారిణికి నిట్లు తమతమ ప్రియులకిచ్చిరి. మరునాడు వాహ్యాళికేగుచు భర్తృహరి యా ఫలము గోమయ ధారిణికడ జూచి, దాని బిలిపించి

8. విక్రమార్క చరిత్రము పీఠిక. పుట-6

ఆం.సా.అ.–శ్రీ పల్లా దుర్గయ్యగారు "వాలి సుగ్రీవులను రక్కసులనినారు. కాని, వారు సుబల మహాబలులను వారేగాని వాలిసుగ్రీవులు గారు. ఇక్కడ 'వాలి సుగ్రీవులు గారు. ఇక్కడ 'వాలిసుగ్రీవులనా" 2-4 అని వ్రాసియుండుట గమనార్హము.

యదిగైకొని, బ్రాహణు రావించి యట్టి ఫలమింకొకటి యున్నదేమో విచారించెను. బ్రాహ్మణుడును నది దేవీ ప్రసాద లబ్ధముగాన నొక్కటే యని జెప్పి, రాజు దానిని భక్షించెనా లేదా యని యడిగెను. రాజు తన భార్య కిచ్చినట్లు జెప్పెను. భార్యను నిర్బంధించి యడుగుటచే భర్తృహరికి ఫలము ప్రయాణించిన విధమంతయు గ్రమముగ దెలిసెను. భార్య తనకు జేసిన ద్రోహమునకు రోసి, విక్రమార్కునకు బట్టముగట్టి తపమునకేగెను.

ఈ కథ కొన్ని మార్పులతో జక్కన విక్రమార్క చరిత్రమున నున్నది.

చంద్రగుప్తుడను విప్రునకు నాల్గు జాతుల స్త్రీలయందును బుట్టిన పుత్రులు వరరుచి, విక్రమార్కుడు, భట్టి, భర్తృహరియను నల్వురు. విక్రమార్కుడుజ్జయిని నేలుచుండ, భర్తృహరి మధుర నేలుచుండెను. భర్తృహరి రాజ్యమున నొక బ్రాహ్మణుడు రుద్రునకై శ్రీకాంక్ష దపమాచరించెను. రుద్రుడు ప్రత్యక్ష మైనంతనే తన కోర్కె మరచి, నిజాయు రభివృద్ధియగు వర మడిగెను. రుద్రుడొక ఫలమిచ్చి యుత్తమమైన యాఫల మేకభక్ష్యమై మిక్కిలి యాయు విచ్చుననియు, నట్లుగాక వేరొకరికడ కేగిన ఫలితముండదనియు జెప్పెను. ఫలముతో గృహమున కేగిన బ్రాహ్మణుని గాంచినయాతని ధర్మపత్ని, యాఫలము వలన దమ దారిద్ర్యము తీరదు గాన చింతిల్లెను. తరువాత బ్రాహ్మణుడును దన బుద్ధి లేమికి వగచి, దానిని గొనిపోయి భర్తృహరికిచ్చి సమ్మానితుడై సంతోషించెను. అటు పిమ్మట కథయంతయు సంస్కృత విక్రమార్క చరిత్రమునందు వలెనే యున్నది. అంతమున భర్తృహరి తన రాజ్యమును విక్రమార్కుని కప్పగించి, తపమున కేగెను.

భర్తృహరి తండ్రి తక్కిన యిద్దరు సోదరుల ప్రసక్తి సంస్కృత గ్రంథమున లేదు. తెలుగు గ్రంథమున నున్నది. మరియును భర్తృహరి విక్రమార్కునకు తమ్ముడని జక్కన చెప్పెను. సంస్కృతమున విప్రుడు భువనేశ్వరుని బ్రసన్నునుజేసికొన, తెలుగున రుద్రు నారాధించెను. జక్కన చేసిన మార్పొకటి యిట గమనింపదగియున్నది. సంస్కృత విక్రమార్క చరిత్రమున దేవి ఫలమిచ్చి, దానివలన జరామరణములుండవని మాత్రమే దెల్పినది. కాని, జక్కన తన రుద్రునితో 'ఉత్తమ మీఫల మేకభక్ష్యమై మిక్కిలి యాయువిచ్చు, నిది మృత్యుహరం బటు గాక తక్కినన్ ఒక్క ఫలంబును గలుగకుండుఁజుమీ' యని యానతిచ్చెను. ఇట్టి మార్పు కథ కెంతయు నావశ్యకమైనది గాన, దీనివలన కథ లోప రహితమైనది.

విజ్ఞాన సరస్వతి

లేకుండుటచే గురువును రహస్యముగ భూగృహమున దాచి, యాతని జంపితినని రాజుతో బొంకి సంతోషపెట్టెను. కొంతకాలమునకు రాకుమారుడు వేట కేగునపుడు భూకంపము ఉల్కాపాతము, అనావృష్టి ఇత్యాదులగు దుర్నిమిత్తముల గాంచి, మంత్రి పుత్రుడగు బుద్ధిసాగరుడు. వేట కేగవలదని యాతని వారించెను. బుద్ధిహీనుడగు జయపాలుడు నిరాకరించుటచే "నీకు వినాశ కాలము వచ్చినది గనుకనే యిట్లు మాట వినకుండు విపరీత బుద్ధి పుట్టిన'దని బుద్ధిసాగరుడాతని నిందించెను. పిమ్మట జయపాలుడు వేటాడుచు చాల దూరమేగి వెనుకకు జూడ సైన్యము కానరాలేదు సైన్యమును వెదుకుచు నాతడు దారితప్పి తిరుగాడుచుండ నొక వ్యాఘ్ర మాతని దరిమెను. ఆతడు పరుగెత్తి యొక చెట్టెక్క, అంతకు మునుపే చెట్టెక్కిన భల్లూకము గానవచ్చుటతో, నాతని భయము రెండింతలాయెను. ఆ యెలుగాతని కభయమిచ్చి, యాశ్రయము నిచ్చి నిదురవచ్చుట గమనించి తన తొడలపై విశ్రాంతి గైకొమ్మనెను. పులి యాశతో క్రిందనే వేచి యుండెను. పులి యెలుగుతో మానవుని నమ్మరాదని, యాతని గ్రిందకు ద్రోచిన నా మాంసములో సగమిత్తునని యాశపెట్టినను ఎలుగు జయపాలున కాశ్రయ మిచ్చి మోసగించుట పాపమని, ఆతడు తనకు మిత్రుడని చెప్పెను. తరువాత ఎలుగు జయపాలుని తొడలపై తల నిడి నిద్రించుచుండెను. అప్పుడు పులి యాతనితో తా నేగిన వెనుక నాయెలుగు తప్పక యాతని వధించునని చెప్పగా, చేసిన మేలు సైతము మరచి కృతఘ్నుడైన జయపాలుడు భల్లూకమును గ్రిందకు త్రోసెను. అది చెట్టుకొమ్మలు పట్టుకొని పడక తప్పించుకొనెను. 'ససేమిరా' యనుచు బిశాచమువలె పరిభ్రమింపుమని జయపాలుని శపించి, ఎన్నడే నెవ్వడే నా వృత్తాంతము వెల్లడిచేసిన, నాతడెప్పటివలె అగునని శాపవిముక్తిని గూడ భల్లూకము దెల్పి, తనదారి బోయెను. తెల్లవారి నంతనే వ్యాఘ్రము కూడ పోయెను జయపాలుడు శాపవశమున ససేమిరాయని వదరుచు నా యరణ్యమున దిరుగుచుండెను. రాకుమారుని వెదకుచు వచ్చిన భటులా విధముగ వదరుచున్న వాని గాంచి రాజభవనమునకు గొనిపోయిరి. మంత్రివలన నీ విషయమంతయు దెలిసిన శారదా నందుడు రాజు ఆందోళన దీర్పగోరి శారదానందుని పుత్రిక జయపాలు నెప్పటివలె జేయునని మంత్రిచేత రాజునకు జెప్పించెను. తిరస్కరిణి వెనుక నుండి స-సే-మి-రా యను నా నాల్గక్షరములే ప్రారంభమున నుండునట్లుగ నాల్గు పద్యములు బఠించెను. ఒక్కొక్క పద్యము చదివినంతనే యొక్కొక్క యక్షరమును రాకుమారుడు వదలుచు నంతమున వదరుట మాని పూర్వము జరిగిన దంతయు స్మృతి పథమునకు రాగా, నంతయు దండ్రికి జెప్పెను. బాలిక కిదంతయునెట్లు తెలిసిన దని రాజు విస్మితుడు కాగా, తెరవెనుక నున్న గురుడు తన కదంతయు శారదాదేవి వరమువలన భానుమతీదేవి తొడమచ్చ సంగతి తెలిసినట్లే—గానవచ్చిన దనెను. రాజు గురువు బ్రతికియే

2. రంభోర్వశుల నాట్యవృత్తాంతము :— విక్రమార్కుడుజ్జయిని నేలుచుండ, దేవలోకమున రంభోర్వశులకు దగవు వచ్చెను. వారిద్దరిలో నెవ్వరెక్కుడు నాట్యకళా ప్రవీణలో దేవతలలో నెవ్వరును జెప్పలేకుండిరి. అంత నారదుడు భూలోకమున విక్రమార్కుడు సర్వశాస్త్రపారీణుడు గాన, నాతని బిలిపించిన సమస్య పరిష్కార మగుననెను. ఇంద్రుడు మాతలిని బనిచి విక్రమార్కుని నాకమునకు బిలిపించెను. అతడు బేతాళునితో పాటుగ సుధర్మకువచ్చి వారిద్దరి నృత్యము దిలకించి యూర్వశియే యిద్దరిలో మిన్నయని నిర్ణయించెను. పాకశాసనుడు తుష్టుడై యతిమనోహరమును, మణిమయమును నైన సింహాసనమును బహూకరించెను. అందు ముప్పది రెండు సాలభంజికలుండినవి. వాని తలలపై పాదములు మోపి యా సింహాసనమును అధిరోహింపవలెను. విక్రమార్కుడు దేవేంద్రు వీడ్కొని యుజ్జయినికి వచ్చి బ్రాహ్మణాశీర్వాద పూర్వకముగ దాని నధిష్ఠించి, రాజ్యమేల దొడగెను.

ఈ కథ యిటులనే జక్కన విక్రమార్క చరిత్రమున నున్నది. బేతాళుని ప్రసంగము లేనందున మాతలి తెచ్చిన రథమెక్కి సుధర్మ కేతెంచినట్లున్నది.

3. బహుశ్రుతుని కథ : —విక్రమార్కుని యనంతరము కొన్ని వందల యేండ్లకు భోజరాజునకు విక్రమార్క సింహాసనము లభించెను. దాని నధిష్ఠింప బోవుతరి మంత్రుల గొప్పదనమును బ్రశంసించు బహుశ్రుతుని కథను భోజుని మంత్రి యొకడు భోజునకు జెప్పెను.

విశాలా నగర రాజు నందుడు. అతడు నిజ బలముచే శత్రువుల బాదాక్రాంతులజేసి కొనెను. దాని, పట్టమహిషియగు భానుమతితోబాటు సింహాసన మధిష్ఠించు చుండెను. ఆమె లేనిదే యొక్క క్షణమైన నుండలేక యంతఃపురమున భార్య సాన్నిధ్యముననే యుండెను. మంత్రి బహుశ్రుతుడు మిగుల జింతించి, ఆమె చిత్రమును లిఖింపజేసి దానిని సభలో జూచు చుండుమనెను. రాజట్లే చిత్రమును లిఖింపజేసి యానందించి, రాజగురువగు శారదా నందనున కా చిత్రమును బంపెను. శారదానందనుడును దానిని గాంచి భానుమతీ దేవికి తొడలోని నల్లని మచ్చ చిత్రపటమున లేకుండుట, దానిని గూడ చిత్రకారునిచే లిఖింపజేసెను. చిత్రకారుడీ విషయమును రాజునకు దెలియజేసెను. నందరాజు గురువును శంకించి యాతని వధింపుమని మంత్రి నాజ్ఞాపించెను. మంత్రి రాజునకు నీతు లుపదేశించియు ఫలితము

యున్నాడని గ్రహించి సంభ్రమముతో లేచి ప్రణమిల్లి క్షమాభిక్ష వేడుకొనెను. అటుపిమ్మట కాళిదాసుండు ఐదుబ్రాహ్మణులు జెప్పినట్లుగనే ప్రజా రంజకముగ రాజ్యమేలెను.

ఈ కథ చిరు మార్పులతో, పైవిధముగనే జక్కన విక్రమార్క చరిత్రము నందున్నది. సంస్కృత గ్రంథమున నీ కథను భోజుని మంత్రి భోజునికి జెప్ప, తెలుగున భర్తృహరి విక్రమార్కునకు జెప్పెను. సంస్కృత గ్రంథమునందలి జయపాలుడు తెలుగున విజయపాలు డయ్యెను. మంత్రి పుత్రుడగు బుద్ధి సాగరుని ప్రస్తావమును వదలి, జక్కన రాకుమారునకు బిసరుహల వారిచే వేట తగదని చెప్పించెను.

ఇంతవరకును సంస్కృత గ్రంథమున కవి చెప్పిన కథలున్నవి. తరువాత సింహాస నము నెక్కబోవు భోజునకు సాల భంజికలు చెప్పిన కథలున్నవి.

4. మొదటి సాలభంజిక భోజుని తారించుచు నన్న మాటలివి.

శ్లో॥ వీక్షితే సహస్రంతు నియతంతు ప్రజల్పతే,
హసితే లక్షమాప్నోతి తుష్టేర్థే కోటిశ్శోఖ్నతే.

ఈ శ్లోకము సంస్కృత గ్రంథమున మొదటి సాలభంజిక చెప్పిన కథగ నున్నది. చూచిన వేయి, మాటలాడిన ఐదువేలును, నవ్విన లక్షయును, తుష్టిబొందిన కోటియు విక్రమార్కుడిచ్చెడి వాడనియు, నట్టి దాతృత్వము నీకున్నదా యని సాలభంజిక ప్రశ్నింప, భోజుడు సమాధానము నీయలేక వెనుకకు మరలెనట. జక్కన దీనిని కొంచెము మార్చి 'కూడుప లక్ష యెందము ప్రమదంబున బొందిన కోటి ధనం బనయము అర్థులకు విక్రము డొసగు'న వ్రాసెను (2-౪).

5. రెండవ సాలభంజిక చెప్పిన కథ :

విక్రమార్క విభుడు రాజ్యము చేయుచు, ఇల్వురు చారులను దేశమంతయు దిరిగి యెచటెచట కౌతుక ప్రదములగు దేవాలయములు, వింతలు విశేషములున్నవో దెలిసికొనివచ్చి

9. సంస్కృత విక్రమార్క చరిత్రము-పుట 24.

తనకు నివేదింపుమనెను. ఆ విధముగ నేగిన యొక చారుడు చిత్రకూట పర్వత సమీపమున మనోహరమగు దేవాలయమును, ఆ పర్వతాగ్రభాగమునుండి పడు జలధారను గాంచెను. అందుస్నానమాడిన బాపములన్నియు నశించును. పాపులెవ్వరైన స్నానమాడిన వారి శరీర మున్నంత మేరకు కాటుకవంటి నల్లని నీరు ప్రవహించును. అట నొక విప్రుడు మౌనియై ప్రతిదినమును హోమగుండమున మాలూర ఫలములను వ్రేల్చుచుండెను. ఎన్ని సంవత్సరములనుండి వ్రేల్చుచున్నాడోగాని, హోమగుండము నుండి వెలికి వచ్చిన భస్మము పర్వతాకారముగ నున్నది. చారుడీ వింతను, తీర్థ మహిమను విక్రమార్క భూమీశున కెరిం గించెను. రాజటకు బోయి తీర్థమున మజ్జనముచేసి, బ్రాహ్మణుని కడకేగి నమస్కరించి, హోమకారణ మడిగెను. అతడు మౌనమును వదలి సప్తర్షి మండలము రేవతీ ప్రథమ చర ణమున నుండ హోమ మారంభించితి నని, ప్రస్తుత మశ్వినీ నక్షత్రమని, యెంతకాలము వ్రేల్చి నను దేవత ప్రసన్నగాలేదని తెల్పెను. విక్రమార్కుడును గొంత తడవు వ్రేల్చిదేవి ప్రసన్న గాకుండుటచే తన తల నరికి కొన ఖడ్గము నెత్తి మెడపై నుంచుకొనెను. వెనువెంటనే దేవి ప్రత్యక్షమై యాతని వారించి, యాతని కోర్కెపై మునికి వరమిచ్చెను. విక్రమార్కుడు దేవి యతనికి బ్రసన్న గాకుండుటకు గారణమడుగ, నామె యాతని కేకా గ్రత లేదనియు, భావమున దైవముపై నమ్మక ముండవలెనుగాని కేవలము వ్రేళులు లెక్క పెట్టుచు జపించిన ఫలము లేదనియు, నందువలననే యాతని దా ననుగ్రహింపలేదనియు జెప్పి యంతర్హిత యయ్యెను.

ఈ కథ యొక్క చిన్నమార్పుతో నంతయు నటులనే జక్కన విక్రమార్క చరిత్రమున నున్నది. ముని తపమాచరించిన కాలము వివరమిందులేదు. ఇది తప్ప చారుడు చూచి వచ్చిన వింతను రాజుకు జెప్పుట, రాజచటకేగి దేవిని ప్రత్యక్షము గావించుకొనుట యిత్యాదులన్నియు రెంటను సమానములే.

## 6. మూడవబొమ్మ చెప్పిన కథ :

విక్రమార్క చక్రవర్తి సర్వస్వ దక్షిణ సమర్పించు నశ్వమేధమును జేయ సంకల్పించి, యతి మనోహరముగ నున్న యజ్ఞాయతనమును నిర్మింప జేసెను. సకల యజ్ఞ సామగ్రిని దెప్పించి దేవర్షి యక్ష గంధర్వ సిద్ధరాజ బ్రాహ్మణాదులను బిలిపించెను. సముద్రుని గూడ నాహ్వానించుటకై యొక విప్రుని బంపెను. అతడు సముద్ర తీరమునకేగి గంధపుష్పాక్షతల

నుంచి సముద్రుడు సర్పించి పుష్పాంజలి నుంచి వేచియుండెను. ఎవ్వరును సమాధాన మీయలేదు. అతడు తటమునకు రాగానే దేదీప్యమాన శరీరముతో నొక మహీసురు డేతెంచెను. 'మీ రాజు నన్నాహ్వానించినాడు గాన నాతని సమ్మానింపవలెనని' యాతడు నాల్గుమణుల నాతనికిచ్చి పంపెను. యాగమైన వెనుకనే యా బ్రాహ్మణుడు విక్రమార్కుని కడకు రాగల్గెను. సమస్తమును దానము జేసినవాడుగాన, విక్రమార్కునికడ నా బ్రాహ్మణుని కిచ్చుటకేమియును లేక యామణులలో నొకదానిని బ్రాహ్మణుని గైకొనుమని విక్రమార్కుడనెను. వానిలో నొకటి షడ్రసోపేతమైన దివ్యాన్నములను ఒకటి చతురంగ బలముతోడి సైన్యమును, ఒకటి వస్త్రాభరణములను, నాల్గవది ధనమును నిచ్చునట్టివి. బ్రాహ్మణుడు విక్రమార్కుని యను మతిపై గృహమునకేగి భార్యను, పుత్రుని, కోడలిని సంప్రదించెను. బ్రాహ్మణుడు ధన మిచ్చుదానిని గైకొందమనెను. అతని భార్య దివ్యాన్నము లిచ్చుదానిని, కుమారుడు సైన్యము నిచ్చుదానిని, కోడలు వస్త్రాభరణము లిచ్చు దానిని స్వీకరింతమనిరి. వారిలో వారికి సఖ్యము కుదురక బ్రాహ్మణుడు విక్రమార్కుని కడకు మరలివచ్చి యంతయు నివేదించెను. విక్రమార్క విభుడా నాల్గింటిని ఆతనికిచ్చివేసి యతనిని సంతోషింప జేసెను.

ఈ కథ చిన్నమార్పులతో జక్కన విక్రమార్క చరిత్రమున నున్నది. బ్రాహ్మణుడు యజ్ఞవేళకు ముందే విక్రమార్కుని కడకు వచ్చెను. మణుల మహిమ వినిన విక్రమార్కమహీశుడు బ్రాహ్మణునిగూడ నొక యజ్ఞమాచరింపుమని, యా నాల్గింటి నాతని కిచ్చివేసెను. సంస్కృత గ్రంథమందలి నాల్గు మణులకు సంబంధించిన కలహ మిందులేదు. అదియునుగాక అట్టి మహిమగల నాల్గు వస్తువులిదివరకే విక్రమార్కునికడ నున్నవి. అందువలన నా నాల్గింటిని విక్రమార్కుడు బ్రాహ్మణుని కిచ్చెను. నాల్గుమణులలో నొకటి గైకొనుమనుట జక్కన సృష్టించిన విక్రమార్కుని తత్త్వమునకు విరుద్ధము. ఈ మార్పులు తప్ప తక్కిన కథ యంతయు రెండు గ్రంథము లందును సమానము.

## 7. నాల్గవ బొమ్మ చెప్పిన కథ :

ఒకానొక బ్రాహ్మణుడు ఈశ్వరారాధనమున దేవదత్తుడను పుత్రుని పొందెను. ఒక నాడు దేవదత్తుడు సమిధలకై యడవికేగి, వరాహమును వెంటాడుచు దారి తప్పి దాహముతో బాధపడుచున్న విక్రమార్కుని గాంచెను. విక్రమార్కుడు దేవదత్తుని రాజ్యమునకు దారి యడిగెను. దేవదత్తుడు రాజునకు చల్లని నీరిచ్చి దాహము దీర్చి దారి చెప్పుటయేగాక దానును

రాజునకు దోడుగ రాజగృహము వరకును వచ్చెను. ఆతని రాజభక్తికి మెచ్చి రాజాతని కున్నత
పదవి నొకదాని నిచ్చెను. మరియు సభలో దరచుగ దేవదత్తుడు తనకు జేసిన మేలు మరువ
రానిదని, దానికాతడు దానెంతయు ఋణపడి యున్నాడనని ప్రశంసించు చుండెను. దేవదత్తు
నికి రాజాడు మాటలలోని సత్యాసత్యములను పరీక్షింప వలెనను తలంపు కల్గెను. అంతఃపుర
ములో నతనికి నిరాటంకముగ ప్రవేశముండెడిది. విక్రమార్కుని పుత్రుడగు చిన్నబాలునితో
నాతడు తరచుగ నాటలాడుకొనుచుండెను. ఒకనాడట్లాడుటకేగి, తన నెవ్వరును గమనించని
తరిని రాకుమారు నెత్తుకొని తన గృహమునకేగి, యాతని రహస్యముగ నొకచో దాచెను.
పిమ్మట నాతని యాభరణముల నొక పరిచారునకిచ్చి రాజవీధిని వాని నమ్మజూప బనిచెను.
అంతఃపురమున రాకుమారుడు కానవచ్చుటలేదని గగ్గోలు పుట్టెను గాని, యెవ్వరికిని దేవదత్తు
నిపై ననుమానము రాలేదు. అంగడి వీధిలో నాభరణములను గుర్తించిన రాజభటులు దేవ
దత్తుని పరిచారకుని బంధించి రాజసభకు గొనిపోయిరి. తనకేమియు దెలియదనియు, తన
యజమాని పంపుటవలననే తానంగడి వీధికి వచ్చితిననియు నా సేవకుడు విన్నవించుకొనెను.
ఆతనిని వదలి దేవదత్తుని పిలిపింపుమని రాజన, ఆ విధముగనే దేవదత్తుడు సభకు వచ్చెను.
ఆభరణముల నాశించి తాను రాజపుత్రుని జంపినాడనని దేవదత్తుడు రాజుతో జెప్పెను. సభలో
నందఱును దిగ్భ్రాంతులై యా కృతఘ్నుని శూలమున వేయవలెనని, తిలఖండములంతగా
నఱికి గృధ్రములకు బలి యీయవలెనని. పలువిధములుగ నిందింపసాగిరి. రాజందరను
శాంతపరచి, తాను దేవదత్తుని వదలివేయుచున్నాడనని ప్రకటింపగనే సభలో హాహాకారములు
చెలరేగెను. అందులకు సమాధానముగ రాజు దేవదత్తు డరణ్యమున దనదాహము దీర్చకుండిన
తానేనాడో మరణించి యుండెడివాడనని, యాతనివలననే తాను మరల రాజై వైభవము
లనుభవించుచున్నాడనని జెప్పి యాతని విడిచి పుచ్చెను. విక్రమార్కుని యున్నతగుణమున
కెంతయు సంతోషించిన దేవదత్తుడు రాకుమారుని దీసికొనివచ్చి రాజున కప్పగించెను.
రాజాశ్చర్యపడి యిదేమని ప్రశ్నింప, దేవదత్తుడు రాజు తఱచుగ దన్ను ప్రశంసించుటలోని
సత్యాసత్యము లెరుగుట కట్లు చేసితిననియు, తన్ను హృదయపూర్వకముగ క్షమింపుమనియు
రాజు నర్థించెను. రాజాతని క్షమించి యెంతగనో సత్కరించెను.

ఈ కథయంతయు నటులనే జక్కన గ్రంథమున నున్నది గాని, కొన్ని మార్పులున్నవి.
దేవదత్తుని జన్మవృత్తాంత మిందులేదు. సంస్కృత విక్రమార్క చరిత్రము నందువలె దేవ
దత్తుని తండ్రి వృత్తాంతముతో గాక, తెలుగు కథ విక్రమార్కరాజు వేటకు వెడలుటతో ప్రారంభ
మగును. విక్రమార్కుడు దేవదత్తున కిచ్చినది పౌరోహిత్యమని జక్కన స్పష్టముగ వ్రాసెను.

విజ్ఞాన సరస్వతి

సంస్కృత గ్రంథమున నా పదవి యేదో చెప్పబడలేదు. మరియు దేవదత్తుడే రాకుమారుని యాభరణముల నమ్మజూచి యారెకులచే బట్టుబడెననియు జక్కన మార్చెను.

8. బొమ్మిదవ సాలభంజిక చెప్పిన కథ :

విక్రమార్కుని సేనాపతి పుత్రుడగు కమలాకరుడగువాడు విలాసియై విద్యలు నేర్వకుండెను. తండ్రి తీవ్రముగ మందలించిన పిదప పశ్చాత్తాపముతో కాశ్మీరమునకేగి చంద్రమౌళి భటరామోపాధ్యాయుని కడ సర్వవిద్యలను నేర్చెను. మరలివచ్చునపు డొకచో నరమోహినియను వారకాంతను గాంచెను. ఆమె పొందుగోరి వచ్చిన వారందర నొకరాక్షసుడు రక్తము పీల్చి చంపుచుండెను. ఈ వింతను కమలాకరుడు విక్రమార్కునితో జెప్పెను. విక్రమార్కు డతనితోడటుగ నటకేగి, యారక్కసుని వధించి నరమోహినిని కమలాకరున కిచ్చి వివాహము చేసెను.

ఈ కథ యించుక మార్పులతో జక్కన విక్రమార్కచరిత్రమున నున్నది. సంస్కృత గ్రంథమున రక్కసుడు నరమోహిని పొందుగోరినవారిని రక్తము పీల్చి చంపుచుండ, తెలుగున మార్పున్నది. రక్తము పీల్చుటవలనగాక యుద్ధమున జంపుచుండెను. సంస్కృత గ్రంథమున కమలాకరుని తండ్రి. సేనాపతి తెలుగున రాజపురోహితుడు మరియు జక్కన కావ్యమున నరమోహిని రాజును తనయందను రక్తుడగు రక్కసుడందర జంపుచున్నాడని, యతని బారినుండి తన్ను రక్షింపుమనియు నర్థించినది. సంస్కృతమున రక్కసుడందరనేల వధించుచుండెనో చెప్పబడలేదు. తెలుగున గారణము చెప్పబడి యుండుట యుచితముగ నున్నది.

9, పదునొకండవ బొమ్మ చెప్పిన కథ :

విక్రమార్కు డొకమారు యోగివేషమున దేశ సంచారము జేయుచు నొక యరణ్యమును జేరెను. ఒక వృక్ష మూలమున విశ్రాంతి గైకొనుచుండెను, ఆ వృక్షముపై జిరంజీవి యను పక్షి యుండెను. పుత్రులు, పౌత్రులు దాని బోషించుచుండిరి. అదియును విక్రమార్కచక్రవర్తివలె వింతలు, విశేషములు దెలిసికొను స్వభావముగలది. ఆనాడు పటుచంచువను

పక్షి చిరంజీవి కొకవింత జెప్పెను. ఉత్తరదేశమున శైవాలక పర్వత సమీపమున పలాశ నగరమను నగ్రహారముండెను. ఒకానొక రాక్షసుడు ప్రతిదినమును వచ్చి యచటి జనుల వధించుచుండెను. ప్రజలది భరింపలేక ఆ రక్కసునితో నొక యొప్పందము జేసికొని, దాని ప్రకార మనుదినమును నొక మనుజుని, యొకబండి నిండ యాహారమును బంపుచుండిరి.[10] (బండికి గట్టిన యెనుబోతుతో బాటుగ మనుజుని, ఆ తిండిని రక్కసుడు భుజించుచుండెను.) ఆ మరునాడొక బ్రాహ్మణుడు రాక్షసున కశనముగ బోవలసియుండెను. ఆ విప్రుని భార్యా పుత్రాదులు శోకించుచుండిరి. సకల మృగ పక్షిభాషలరసిన విక్రమార్క విభుడంతయు విని, యచటికేగి యావధ్య శిలపై గూర్చుండెను. రాక్షసుడేతెంచి నిర్భయుడైయున్న యాతని జూచి 'నన్నుజూచియు భయపడని నీవెవ్వడవు? ఈ శిల నీవు గూర్చుండదగినది గాదు. వేరొక తావునకుంబొ'మ్మనెను. రాజాతనితో సఖుడా! నా శరీరము పరులకొరకే యున్నది. ఏది తోచునో అది చేయుము. నేనిటనే గూర్చొండెద ననెను. రాక్షసుడు రాజు సౌజన్య మాలోకించి 'ఎవని జీవితము పరార్థమో యది ధన్యము,' అని చింతించి 'నీవంటివాడు నా కింతవరకును కనబడలేదు. నీ ధైర్యమునకు మెచ్చితిగాన వరమడుగు'మనెను. విక్రమార్కు డతనిని 'మనుష్య భక్షణము బరిత్యజింపు'మని, యదియే తన కొసగదగు వరమని యనెను. రక్కసుడును సమ్మతించి, యాతని గీర్తించి యటనుండి వెడలిపోయెను.

ఈ కథ కొన్ని మార్పులతో జక్కన్న విక్రమార్క చరిత్రమున నున్నది. పక్షుల కథనము జక్కన కావ్యమున వేరుగనున్నది. చిరంజీవికి కథ చెప్పిన పక్షి యబ్బురిక యను నది. సంస్కృత గ్రంథమున పటు చంచువను పక్షి చెప్పెను. అబ్బురిక యాహారమున కేగినచోట కంకాళఖండనుడగు విహంగపుంగవుడు దుఃఖించుచుండుట గాంచి కారణమాతనినే యడిగెను. అందులకు కంకాళఖండనుడు తన మిత్రుడగు బ్రాహ్మణ కుమారుడొకడు రాక్షసుని కాహారము కాబోవుచున్నాడని, మిత్రుడైయుండియు దానేమియు జేయలేకున్నాడు గనుకనే యంతగా దుఃఖించుచున్నాడ ననియు నబ్బురికకు జెప్పెను. ఆ బ్రాహ్మణ కుమారు డొకమారు తనను, తన బంధువులను వేటకాని వలనుండి తప్పించుటచే తనకు మిత్రుడయ్యెనని గూడ చెప్పెను. రాక్షసుని యాహారవివరములను గూడ జక్కన చెప్పెను. ద్వాదశ గ్రామముల కధ్యక్షుడుగ వింధ్యనగ గహ్వర సమీపమున నొక రక్కసుడుండెను. అతనికా యూరివా రాహారముతో నిండిన బండి నొక మనుష్యునితో బంపుచుండిరి. అతడన్నర సహితంబుగ తదన్నంబు భక్షించుచుండెను. ఈ వివరము సంస్కృత విక్రమార్క చరిత్రమున లేదు.

10. ఇది బకాసురుని కథవంటిది. భారతము. ఆది. 5. 268-306.

సంస్కృత గ్రంథమున రాక్షసుడు విక్రమార్కునితో సౌమ్యముగ మాటలాడెను. ఇట్లు చేయుట రాక్షస తత్త్వమునకు విరుద్ధము. కావున జక్కన విక్రమార్కుని యాహార పదార్థము లేమియు లేకుండ నొంటిగ బంపుటతో, రాక్షసుడు భీకరముగ నరచినట్లు కల్పించెను. ఇట్లు జక్కన యీ కథను ఉచితమైన మార్పులతో రచించెను.

## 10. పండ్రెండవ బొమ్మ చెప్పిన కథ :

భద్రసేనుడను వణిజునకు పురందరుడను కుమారుడుండెను. తండ్రియనంతర మాతడు ధనమును దానధర్మములకై వెచ్చించుచుండ ధనదుడను సఖుడు వారించి, హితోపదేశము చేసెను. కాని పురందరు డాతని మాటలు వినకుండెను. అట్లు ఖర్చు పెట్టిపెట్టి పేద వాడైన పురందరుని బంధుమిత్రు లెవ్వరును ఆదరించలేదు. పలువిధముల వగచి యతడు దేశద్రిమ్మరియై, కొంతకాలమునకు హిమాచల సమీప నగరమును జేరెను. అట నొకచో నిద్రించుచుండ, సమీప వేణువనమునుండి "నన్ను కాపాడుడు మహానుభావులారా! నన్నొక రాక్షసుడు బాధించుచున్నా"డను నార్తనాదము వినవచ్చెను. పురందరుడా నగరజనుల విచారించి, యనుదినము కొన్ని వందల సంవత్సరములనుండి యట్లు వినవచ్చు చున్నను. ప్రాణ భయముచే నెవ్వరు నటకేగలేదని తెలిసికొనెను. విక్రమార్కున కీవింత తెలియుటకు తోడ్కొని వచ్చెను. విక్రమార్కుడా రాక్షసుని వధించి, యామెను గాపాడెను.

ఆమె మహాధనవంతుడగు బ్రాహ్మణుని సతి. వ్యభిచారిణియై భర్తను దరికి రానీ కుండెను. ఆతడు యావజ్జీవమును కామ సంతప్తుడుగనుండి, దేహావసాన సమయమున "వేణువన వాసియగు రాక్షసు డనుదినమును నిన్ను బలాత్కారము చేయవచ్చి బాధించు"నని శపించెను. ఆమె పశ్చాత్తాపముతో నాతని బ్రార్థింప నాతడు "మహాపురుషుడొక్కడు వచ్చి యాతని సంహరించువరకును నీవట్లు బాధపడుము. ఆ మహాపురుషు డారాక్షసుని వధించి నీకు విముక్తి గల్పించు"నని విమోచనమునుగూడ దెలిపి మరణించెను. ఆమె పైవిధముగ దన కథయంతయు జెప్పుకొని, తనది యగు నవ ఘట పరిపూర్ణ సువర్ణమున్న స్థలమును రాజునకు దెల్పి, ప్రాణములు త్యజించెను. రాజా ధనమంతయును వెలికిదీసి పురందరున కిచ్చెను.

# శ్రీమదార్షపురాణము

## శ్రీ పేకుమళ్ళ రామచంద్రరావు

(గతసంచిక తరువాయి)

తే. గీ. పిదప గురుదక్షిణగ శిష్యవితతి నడిగె దీర్ఘతము డేను భాగీరథీ స్రవంతి
నడుమ నిలిచి వేద జపమొనర్పఁ దలఁతు వరద నను తాకకుండ కాపాడవలయు 622.

తే. గీ. అనిన నియ్యకొని, వరద నాపు వేయి కట్టలను గట్టె శిష్యులు గంగ వేయి
పాయలై పారె; గురుజపం బవిఘ్నమగుచు నిత్యము కొనసాగె నతడు మెచ్చ 623.

తే. గీ. చతురులును, బుద్ధిమతులు, సజ్జనులు సకల గుణ ఖనులు తత్సుతులు జనకు కెల్ల
విధములఁ దోడ్పడిరి రాజ్య విషయములను సర్వజనులు సుఖింప తదుర్వియందు 624.

వ. అంగ వంగ కళింగ సింహ ఆంధ్రములనెడు భూ భాగములానాఁడు
బలియేలుబడిలో నుండెను. 625

తే. గీ. బలిముదుసలియై రాజ్యము పంచిపెట్ట వారి భూభాగముల పేర్లు వారికబ్బె.
తెలుగుఁ రాజ్యము లైక్యతలకు నిలయమై పరస్పర సౌభాగ్య మరయుచుండె 626.

వ॥ ఆర్గురు సుతులలో నొకఁడుదత్తుడుగా బ్రహ్మ దేశమునకు రాజయ్యెను. 627.

తే॥గీ॥ దీక్షితము రాక వెనువెంట, తెలుగు సాంప్ర। దాయములచోట వేదపద్ధతులు వెలసె.
'బలి' పిదపకూడ నంగుని పాలనమున। బలముగొని వేదపద్ధతుల్ వ్యాప్తిగాంచె॥
628.

తే॥గీ॥ జనులు దీనికి తమ యయిష్టముఁ దెలుప। బెడచెవిని పెట్టి నంగుఁడు; పెక్కునాళ్ళ।
కంగునకు'సునీథ'కు వేనుఁడను సుతుండు। కలిగి పెద్దవాఁడయ్యె సంగతుల నెఱిఁగె 296

చ॥ తెలిపెను తండ్రికిన్ బ్రజల తీవ్ర విరోధము వేదపక్కికిన్।
పలికెనతండు; "కూపమున వాసమొనర్చెడు కప్పలట్లు, ప।
జ్జలఁగల దేశముల్ ప్రగతి సాధన చేసెడు తీరుమాని, ప్రా।
తెలుఁగుల సాంప్రదాయములు తేవలె నున్నతి కంద్రు బేలలై॥ 630.

క॥ మన తెలుఁగు సాంప్రధాయం। బున కేనడ్డంబురాను; భువి నలు దెసలన్।
జనములు వైదిక కర్మల। ననుసరణమొనర్ప మనకు నాగుట తగునే॥ 631.

క॥ "నీ తాత 'బలి'నృపాలుం। డీతత్త్వము దెలిసి, జనులహితము, భవిష్యత్।
ప్రీతియుఁగోరి, విమర్శా। తీతుండై వేదపద్ధతిని తలపెట్టెన్॥ 632.

క॥ "కోసల, విదేహ, యక్షక। కాసియు తత్పశ్చిమంపు కాశ్యపి వేదో।
ద్భాసితమై, మన సంస్కృతి తో సమ్మిశ్రంబవదె చతుర్దిశ లలరన్॥ 633.

తే॥ గీ॥ "వేదరచనము పూర్తికాలేదు వత్స! । పూర్తియగునాఁటి కందులో బోలెడంత।
తెలుఁగు నాగరకత, సంస్కృతియుఁ జెలంగు। ప్రజలకిది శాంతముగ బోధపరచ
వలయు 634.

కll "వారలకివి వివరించు ప్ర । చారకులను నిర్ణయించి, చర్చలు, గోష్ఠుల్ ।
భూరిజనోపన్యాసము । లూరూరన్ బరగఁజేసి తోడ్పున తనయా 635.

తే॥గీ॥ "ఈ పథమ్మును చేపట్టు మీవు పుత్ర" । యనెడు తండ్రికి సుతుఁడెదురాడలేక ।
తక్షణము పినతండ్రుల దరసి తెలిపె । తాను, ప్రజలును, తండ్రియుందలఁచు
విధము॥ 636.

ఉ॥ "నిక్కము దూరదర్శియగు నీ జనకుండు ప్రజాహితైషియై
మక్కువ మీఱ నీయడల, మానసమున్ వివరించి నట్టి స ।
ద్వాక్కులు, సందియంబుడిగి తద్వచనామృత మాత్మనింపి, పే ।
రెక్కము సత్సుతుండవుగ, నెల్లరు మెచ్చ నృపాల మౌళిగా ॥ 637.

వ॥ అనిన వారికి అంగవేముండిట్లనియె 638.

శా॥ "మీ మీ రాజ్యములందు తద్విధముగా మీరేల వర్తింప రి
ట్లామోదంబు నిరాకృతంబయిన వేదాచార మార్గంబునా
కామోదంబు, క్రియాత్మకం బనుచు నెయ్యంబొప్ప బోధించు మీ ।
మీ మాటల్ మదికిన్ సుబోధకము చేయన్ మిమ్ము నర్థించెదన్ 639.

వ॥ అనిన వారిట్లనిరి. 640.

తే॥గీ॥ "వినుము. మా యేలుబడిలోని జనములెల్ల । ప్రా తెలుఁగు పద్ధతుల కతిప్రబల భక్తి
లెట్టి మార్పులు వారికి గిట్టనేర । వించుకయు వేదపద్ధతి నెరుఁగరిచట ॥ 641.

వ॥ చిట్టిబొట్టు, అట్లతద్దె, బొమ్మలనోము. మొదలగు నూరు నోములలో కొన్నిటినైనను నోచు
టయు, వివిధములగు పేర్లతో స్త్రీ దైవతములను, గ్రామ దేవతలను, చనిపోయిన పితరులను,

# ఆంధ్ర తులసీ రామాయణము

## బాలకాండ : శ్రీ మండ కామేశ్వర కవి

(గత సంచిక తరువాయి)

చౌ॥ వినుచు జనులు తనివి గొను పురిలో
ఘనుల రామ లక్ష్మణులను మదిలో
నునుచుచు నట నత్యుత్సాహంబున్
గనుచు నిట్లు మంగళ దివసంబున్॥ 871

దోహా॥ అతి వేడుకతో నడిపి రటు/లయోధ్యలో నలరారె
మితము లేని యుత్సవములతో/గుతుక మధికమై మీరె॥ 572

చౌ॥ సుదినమున గంకణమును విప్పిరి
ముదము నూత్నమై మొలవగ నొప్పిరి
త్రిదశు లయోధ్యాభ్యుదయము గోరిరి
వదలని తమి నుతులు దనర జేసిరి॥ 873

కౌశిక ముని చనగా నూహించెన్
దాశరథియు వలదని వారించెన్
గౌశలమున వేడ్క దినము భక్తిన్
దా శతగతుల మహీశుడు రక్తిన్॥ 874

కొలుచు చుండగా కుశికజు డొప్పన్
దలర నుతించెను దద్దయు గొప్పన్
వెలదులు తనయులు విభుడును గూడన్
వలి పల్కిరి మన్నన ముని తోడన్॥ 875

మునివర సకలంబును మీ యదిగా
గొనుడు మేము మిము గొల్తుము తమిగా
బను పడ కర్తవ్యము మా చేతన్
బనులు గొనుచు నుండిన నా ధాతన్॥ 876

చౌ॥ కనిన రీతి మిము గందుము నిత్యం
బును మాకీ వరము నొసగు డత్యం
త నీతి నిట్లని యందరు వేగన్
ఘనముగ మ్రొక్కిరి కడు తమి రాగన్॥ 877

అనిన కరుణతో నాశీర్వచనం
బు నొసగి సత్ప్రీతిని గొనుచు జనన్
ముని వెనుకొని నృపుడును రామాదుల్
చనుచు దదాజ్ఞంగొని యా మోదుల్॥ 878

దోహా॥ అయి మళ్లిన రామాకృతిని/యవనీ పతి సద్భక్తి
నయగతి గొని బొగడుచు నరిగె/నా కౌశికు డనురక్తి॥ 879

చౌ॥ వామ దేవుడును వరముని తతులున్
బ్రేమ కుశికజ చరిత్రము నుతులున్
వేమరు చేయుచు వే జనిరంతన్
భూమీశుడు తన పుణ్యము వింతన్॥ 880

పొగడు కొనుచు తన పుత్రుల తోడన్
దగ మళ్లెను నిజధామము గూడన్
నుగరిమ రాముని శుభ గీతములన్
మొగి బాడిరి జనములు ఖ్యాతములన్॥ 881

శ్రీ రాఘవులా సీతాదులతో
హరిగతి నయోధ్యకు కడు తమితో
జేరిన దాదిగ పౌరుల ప్రీతిన్
మీరి రహిని స్వామికి నా రీతిన్॥ 882

చౌ॥ వినుతింపగ వశ మనగా దరమా
ఘన సీతా రాఘవులను నసమా
న నయ యశోరూప నిదానములన్
వినుతి జేయు నే ర్తునె వామతులన్॥ 883

ఛాందు॥ఐన నిజ వచనంబతి పవిత్రం
బగుటకై తోచిన గతిన్
దా నలరి రాముని కీర్తి తులసీ
దాసు డొనరించెనే మతిన్
శ్రీ నలరు రామ యశోబ్ధి పారము
జేర శక్యమె యేరికిన్
సానందముగ సీతా వివాహో
త్సవము వినియెడి వారికిన్॥ 884

ఘనుడైన రాముడఖండ సుఖమం
గళములిడి బ్రోచును సదా
తనివొంద నిందు స్థాని తులసీ
దాస రామాయణ కథా
భి నత మార్గము తెనుగు బాస క
విత్వమున దోహాదులన్
జన హరి కరుణ మండ కామే
స్వర కృతము వర్ధిలు నిలన్॥ 885

సురఠా॥ సీతా రామ వివాహ/క్షేమ యశము వినువారలకు
నాతత సంపద లిచ్చు/నలఘురామ యశము జనులకు॥ 886

ఇది శ్రీ సకల కలికలుష విధ్వంస కరంబగు రామ చరిత మానస సరోవరంబున బాలకాండంబను ప్రథమ సోపానము సంపూర్ణం.

విజ్ఞాన సరస్వతి

# శ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రి వరివస్యా.

## శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిణాం చరితమ్.

డా॥ కందుకూరి సత్య సూర్యనారాయణ మూర్తి
ఎమ్.ఏ.పి.హెచ్.డి

ఆంధ్రప్రదేశే విశాఖమండలే చోడవరం జనపదే పేదనందివల్లి నామకః కశ్చన మహానగ్రహారోఽస్తి. తత్ర యజుశ్శాఖాయాం శ్రౌతప్రక్రియాయాం, స్మార్తప్రక్రియాయాం, కావ్యనాటకాది సాహిత్య గ్రంథేషు, అలంకార శాస్త్రే, వ్యాకరణే, జ్యౌతిషశాస్త్రే ఆధ్యాత్మిక విద్యాయాం చాదీతినో బ్రాహ్మణప్రవరా అనేకే వ్యరాజంత। తే హి నిత్యకర్మానుష్ఠాన పరా స్సదాచార పరాయణాశ్చ। తత్ర కేచన సోమపీథినశ్చ.

తస్మిన్నేవాగ్రహారే గోతమవంశీయాః కేచన శ్రోత్రియా న్యవసన్, తేషాం వంశే సుప్రసిద్ధః "పేరి" ఇత్యుపనామక స్సర్వేశ్వరాఖ్యః ద్విజన్మాఽవసత్। తస్య సూరిసోమదేవీ నామికా ధర్మపత్న్యాసీత్। తయోః పుణ్యదంపత్యోః పూర్వజన్మకృత సుకృత పరిపాక వశేన 20-8-1910 దినే సూర్యనారాయణశాస్త్రిణః పుత్రత్వమవాపుః। ఏతత్సర్వమపి తేషాం గ్రంథ పఠిశీలనేన అభిజ్ఞానాం వచనైశ్చావగమ్యతే।

**విద్యాభ్యాసః :-**

సూర్యనారాయణశాస్త్రిణః పితృభ్యాం కృతో పనయనాది సంస్కారా స్తస్మిన్నేవ గ్రామే సంస్కృత పాఠశాలాయాం బ్రహ్మశ్రీయుతానాం పేరి అప్పల నరసింహశాస్త్రిణాం సమీపే కావ్యనాటకాది సాహిత్య గ్రంథానపాఠిషుః (1) రఘువంశే ఆదితః దశసర్గాః (2) కుమారసంభవే సప్తసర్గాః (3) మేఘదూతమ్, (4) కిరాతార్జునీయే నవసర్గాః (5) శిశుపాలవధే దశసర్గాః (6) నైషధేయచరితే ద్వాదశసర్గాః (7) సాకల్యేన చంపూరామాయణమ్. (8) సాకల్యేన చంపూభారతమ్. (9) సాకల్యేన దశకుమార చరితమ్ (10) కాదంబరీ. (11) శాకుంతల నాటకమ్. (12) ఉత్తర రామచరితమ్. (13) అనర్ఘరాఘవమ్. (14) వేణీ సంహారమ్. (15) ముద్రారాక్షసమ్. (16) ప్రసన్నరాఘవమ్, (17)

మృచ్ఛకటికమ్, (18) అమరకోశ ఇత్యేతే గ్రంథా గురూణాం ముఖాదధీత్యానితరసాధారణం సంస్కృతభాషాపరిజ్ఞానం సంపాదయామాసుః। అద్యత్వేఽపి సర్వేఽపి తే గ్రంథా శ్శాస్త్రిణాం కంఠస్థాస్సంతి। అనంతరం విజయనగర మహారాజ సంస్కృత కలాశాలాయాం బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రిణాం సకాశే భాష్యాంతం వ్యాకరణమధిజగ్ముః। 1. వైయాకరణ సిద్ధాంత కౌముదీ కృత్తద్ధిత ప్రకరణ సహితా। అధ్యయనకాలే ఏవ సిద్ధాంత కౌముద్యామనితరసాధారణః ప్రవేశస్సమజని। 2. పరిభాషేందు శేఖరః వాక్యార్థచంద్రికా సహితః 3. ప్రౌఢమనోరమా శబ్దరత్నం కారకాంతమ్ 4. శబ్దేందుశేఖరః కారకాంతః గురుప్రసాదసహితః 5. మహాభాష్యం ప్రదీపోద్యోత సహితం నవాహ్నికమ్।

ఏషాం విద్వత్తల్లజానాం "పేరి వేంకటేశ్వర శాస్త్రిణాం" పాదాబ్జ సేవయా తదనుగ్రహేణ చ సూర్యనారాయణ శాస్త్రిభి ర్వ్యాకరణ శాస్త్రే సన్మతిస్సము పాలంభి, తాదృశానాం వైయాకరణ మూర్ధన్యానాం వేంకటేశ్వర శాస్త్రిణాం స్వరూపం ప్రసంగవశాన్నిరూప్యతే। ఏతే మహామహోపాధ్యాయ "తాతా సుబ్రహ్మణ్య శాస్త్రిణాం" ముఖ్య శిష్యాః। బహుమేధాసంపన్నాః, కుశాగ్ర బుద్ధయః। వ్యాకరణ శాస్త్రే ఏభిః కృతో నిర్ణయో ఽప్రతిహతః। ఏతే వ్యాకరణ శాస్త్రే గ్రంథద్వయం నిరమాసిషః। 1. గురుప్రసాద శేషః — సుబ్రహ్మణ్య శాస్త్రిప్రదర్శితం సమన్వయమార్గమనుసృత్య హల్సంధేరారభ్య కారకాంత పర్యంతం నాగేశ శబ్దేందు శేఖరస్య గురుప్రసాదశేషనామకం వ్యాఖ్యానమరచయన్। గురుప్రసాద ఇవాయమపి శబ్దేందుశేఖరే ఇతరవ్యాఖ్యాతృభిః ప్రదర్శితానాక్షేపాన్ పరిహృత్య నాగేశసిద్ధాంతో మహాభాష్యాశయ సంవలిత ఇతి న్యరూపయత్।

**2. నాగేశ గూఢార్థ దీపికా :-**

నాగేశభట్ట విరచిత పరిభాషేందుశేఖరస్య వ్యాఖ్యేయమ్। పరిభాషేందు శేఖరస్యానేకే వ్యాఖ్యానగ్రంథాస్సంతి। కింతు సర్వేఽపి తే నాగేశ మతఖండనపరాః। ఇతర వ్యాఖ్యాతృభిః ప్రకటితా భావాః నాగేశ సిద్ధాంతాననుగుణా ఏవ। భాష్యసిద్ధాంతస్యాప్యననుగుణాః। గ్రంథ సమన్వయో ఽపి తైస్సమ్యఙ్న ప్రత్యపాది। శాస్త్రిచరణానాం గూఢార్థదీపికా సర్వాన్ లోపాన్ పరిహృత్య సమ్యక్తయా గ్రంథకర్తురాశయం ప్రత్యపాదయత్। శాస్త్రిచరణానాం ఏ తద్గ్రంథద్వయం ఖండాంతరీయా అపి శిరసా వహంతి।

ఆంధ్ర విశ్వకలాపరిషదధ్యక్షాః వేంకటేశ్వర శాస్త్రి చరణాన్ "కలా ప్రపూర్ణే"తి బిరుదేన సమ్మానయామాసుః: ఆంధ్ర విశ్వకలా పరిషదా వేంకటేశ్వర శాస్త్రిణాం గ్రంథద్వయమపి ముద్రితమ్। సర్వైర్వైయాకరణై రాద్రియతే తద్గ్రంథద్వయమ్। భారత ప్రభుత్వం వేంకటేశ్వర శాస్త్రిణః "అవిచ్ఛిన్నజీవికయా" (President Award) సమ్మానయామాస। ఏతత్సర్వమపి శ్రీ సూర్యనారాయణశాస్త్రి విరచిత 'వృత్తివిచార' నామక గ్రంథాదవ గమ్యతే।

అనంతరం బ్రహ్మశ్రీ తాతా సుబ్రహ్మణ్య శాస్త్రి చరణానాం సన్నిధౌ మంజూషాద్యార్థిక గ్రంథానధ్యగీషత। 1. బృహద్వైయాకరణ భూషణం 2. భూషణ సారః 3. లఘు మంజూషా 4. శబ్దకౌస్తుభః 5. కావ్యప్రకాశః 6. ధ్వన్యాలోకః 7. చిత్ర మీమాంసా 8. రసగంగాధరః 9. వ్యక్తివివేకః 10. శబ్దశక్తి ప్రకాశికా 11. భాట్ట రహస్యమ్ 12 భాట్ట దీపికా 13. వాక్య పదీయమ్ ఇత్యాదీన్ గ్రంథాన్ సవిమర్శం గురుచరణేభ్యఽధిజగ్మః। ఏ తాదృశగ్రంథాధ్యయనస్య దైవవశాదనుకూలః కాలః ఆసీత్। తస్మిన్ సమయే పుణ్యపత్తనీయ (పూనా) భండార్కరు సంస్థ ద్వారా పండితవేతన పూర్వకం వ్యాకరణ శాస్త్రే ఉద్గ్రంథపరిశీలనకార్యక్రమః సమజని। తత్ర సూర్యనారాయణ శాస్త్రిణః విజయనగర కలాశాలాధ్యక్షైః పి. వి. రామానుజ స్వామిభిః న్యయోజిషత। తత్కార్యకరణే ఏవ మహామహోపాధ్యాయానాం పాద పంకజసేవా సూర్యనారాయణ శాస్త్రిణాం సముపలబ్ధా। అత ఏవైతాదృశోద్గ్రంథ పఠనస్యావకాశస్సంజాతః। యేషామనుగ్రహేణ, యత్పాదాంభోజ సేవనేన చానన్య సామాన్యా ఆర్థికప్రక్రియా సమాసాదితా సూర్యనారాయణ శాస్త్రిభిః, తేషాం సుబ్రహ్మణ్య శాస్త్రి చరణానాం పరిచయః ప్రసంగాత్ కించిల్లిఖ్యతే। ఏతే సుబ్రహ్మణ్య శాస్త్రి చరణాః శ్రీ మద్విజయనగరపురాధీశానామాస్థాన పండితా అభూవన్। బ్రహ్మశ్రీ రుద్రా భట్ల రామలక్ష్మణ శాస్త్రి చరణానాం శిష్యాః। సర్వ తంత్ర స్వతంత్రాః। పుం భావ సరస్వత్యః। ఏషాం "రాయుడు శాస్త్రీ"తి సుప్ర సిద్ధో వ్యవహారో లోకేఽస్తి। ఏషాం జార్జి సమ్రాట్ "మహా మహోపాధ్యాయ" ఇతి బిరుద మదాత్। ఆంధ్ర విశ్వకలా పరిషదధ్యక్షాః "కలా ప్రపూర్ణ" ఇతి బిరుద మదుః। శ్రీ మద్విజయనగర సంస్కృత కలాశాలాయాః ప్రథమ ప్రధానోపాధ్యాయా ఏతే। వ్యాకరణ శాస్త్రే మంజూషాభూషణసారౌ, అలంకార శాస్త్రే కావ్యప్రకాశ-చిత్రమీమాంసా-ధ్వన్యాలోక - రసగంగాధర - వ్యక్తివివేకాః ధర్మశాస్త్రేష్వేషాం ప్రతిభావిశేషాదేవ అస్మిన్ప్రాంతే వ్యరాజంత। అద్యతన వైయాకరణాః పరంపరయా

సాక్షాద్వా సుబ్రహ్మణ్య శాస్త్రి శిష్య కోటి ప్రవిష్టా ఏవ। అయమేకః కులపతిః। ఏషాం ప్రతిభోన్మేషాద్వ్యాకరణశాస్త్రే ద్వౌ గ్రంథౌ వ్యలసతామ్।

1. గురుప్రసాదః :-

అయం నాగేశపండిత విరచిత లఘుశబ్దేందుశేఖరస్యాచ్సంధ్యంతభాగస్య వ్యాఖ్యానగ్రంథః। అయం కయాచన విచిత్రప్రణాలికయా సంవలితః। యథా — శబ్దేందు శేఖర స్యానేకోద్దండపండితాః వ్యాఖ్యాః నిరమాసిషు। తాః సర్వా అపి వ్యాఖ్యాః నాగేశ మతదూషణాయైవ ప్రవృత్తాః। కింతు నాగేశస్య యావద్గ్రంథ పరిశీలినాం నాగేశమతే దోష లేశోఽపి న దృశ్యతే। తాన్సర్వాన్‌గ్రంథానపరిశీల్య రాఘవేంద్రాచార్య ప్రభృతయో నాగేశ మతేదోష ముద్భావయంతి। ఏతత్సర్వం మనసి కృత్వైవ సుబ్రహ్మణ్యశాస్త్రిణః "గురుప్రసాద" ఇతి వ్యాఖ్యాం శబ్దేందుశేఖరస్య వ్యరచయన్। తత్ర తేషాం ప్రతిజ్ఞా—"యే దోషాః పండితైః పూర్వై ర్నాగేశవచనక్రమే ప్రదర్శితా వివృణ్వత్యబ్ధి ర్లఘుశబ్దేందుశేఖరమ్", తాన్నిరాకృత్య నాగేశసిద్ధాంతానాం ప్రకాశనే శబ్దేందుశేఖరగురుప్రసాదోఽయం విజృంభతామ్" ఇతి।

2. చిత్రప్రభా లఘుటిప్పణీ లఘుశబ్దరత్నస్య భాగవతహరిశాస్త్రిణః చిత్రప్రభేతివ్యాఖ్యాం రచయామాసుః। ఏతేఽపి విజయనగరమహారాజానామానందగజపతీ నామాస్థాన పండితాః। ఏతేషాం వ్యాఖ్యా శబ్దరత్నఖండనపరా। యథార్థపరిశీలనే తత్ఖండనస్యావకాశో నాస్తీతి ఏతే శాస్త్రిణః లఘుటిప్పణీతి విమర్శనాత్మకం గ్రంథం చిత్రప్రభాయామరచయన్। తత్ర తేషాం శాస్త్రిచరణానాం ప్రతిజ్ఞా "అపాదితాన్ శబ్దరత్నే దోషాన్ చిత్రప్రభాకృతా సముద్ధరతు సత్వేవా శ్రీ బాలపరమేశ్వరీ" ఇతి। ఏతద్గ్రంథద్వయమపి ఆంధ్రవిశ్వకలా పరిషదా ముద్రితమ్। ఏవం తాతా సుబ్రహ్మణ్యశాస్త్రిణః గ్రంథద్వయరచనయా వైయాక రణలోకస్య మహాంతముపకారమకుర్వన్।

ఏవంచ ప్రక్రియావ్యాకరణగ్రంథానార్థిక వ్యాకరణగ్రంథాన్‌చ గురుచరణేభ్యః సమ్యగధీత్య తేనైవ పదార్థేన తృప్తిమప్రాప్తాః శ్రీ సూర్యనారాయణశాస్త్రిమహోదయాః బ్రహ్మశ్రీ కోల్లూరు లక్ష్మణమూర్తిశర్మచరణేభ్యః న్యాయకాణాదమపి సాకల్యేనావఠన్।

అధీతన్యాయశాస్త్రా ఏతే శాస్త్రిణః "మహామహోపాధ్యాయ" బిరుదధారిభ్యః శ్రీ పేరి లక్ష్మీనారాయణశాస్త్రి చరణేభ్యోఽద్వైత ప్రస్థాన మభజన్। చతుస్తంత్రి కులపతిభ్యః బ్రహ్మశ్రీ కొల్లూరు సోమశేఖరశాస్త్రి పాదేభ్యః ఖండన ఖండఖాద్య గ్రంథమజానంత।

**అధ్యాపన ప్రకారః :-**

శాస్త్రిచరణాః విజయనగర రాజకీయ సంస్కృత కలాశాలాయాం వ్యాకరణాచార్యత్వేన నియుక్తాః, త్రింశద్వర్షకాలే వ్యాకరణ శాస్త్రమ పాఠయన్। అనంతరం ప్రభుత్వ నియమానుసారేణ తతో నివృత్తాః, పూర్వగోదావరీతీరే రాజమహేంద్రనగరే శ్రీ గౌతమీ విద్యాపీఠ సంస్కృత కలాశాలాయాం వ్యాకరణశాస్త్రం ప్రాబోధయన్। తతోఽపి ప్రభుత్వ నియమాను సారేణ నివృత్తాః, 'కర్నూలు' మండలాం తర్గతే మంత్రాలయస్థితే రాఘవేంద్ర మఠే గురుసార్వభౌమ సంస్కృతవిద్యాపీఠే కించిత్కాలం న్యవసన్। అనంతరం తిరుమల తిరుపతి దేవస్థాన నియమావలి మనుసృత్య అద్యత్వే రాజమహేంద్రనగరే స్వగృహే ఏవ స్థిత్వా వ్యాకరణశాస్త్ర మధ్యాపయంతి। ఏతేషాం సవిధే అనేకే ఛాత్రాః వ్యాకరణ శాస్త్రమధీత్య ఆచార్యపదవీం ప్రాచార్య పదవీంచ ప్రాప్య అనేక సంస్కృత విద్యాలయేషు అధ్యాపకాస్సంతో విరాజంతే।

ఏతేషాం వ్యాకరణశాస్త్ర పాండిత్యమాకలయ్య శ్రీ శృంగేరీ దక్షిణామ్నాయ శారదాపీఠనాయకైః జగద్గురుభిః ఆస్థానవిద్వత్వేన ఏతే పర్యగృహ్ణంత। జగద్గురుణామాశిషాం పాత్రమాసన్। తేషాం జగద్గురూణాం గణపతి వాక్యార్థ సభాసు శాస్త్రిచరణాః వ్యాకరణశాస్త్రే వాక్యార్థమకుర్వన్, కుర్వంతిచ। తేన జగద్గురూణామానందాతిరేకస్సమజని। తత్ర తత్ర తైస్తైర్దత్తాని 'వ్యాకరణరత్న' 'వ్యాకరణాచార్య' 'వైయాకరణకేసరీ' 'ఉపనిషదర్థవాచస్పతిః' 'దర్శనాచార్య' ఇత్యాదీని బిరుదాన్యేవ తేషాం పాండిత్యవైభవస్య నిదర్శనాని। భారత ప్రభుత్వం 1968 సంవత్సరే 'జాతీయపురస్కారం (National Award)', 1980 సంవత్సరే 'రాష్ట్రపతి సన్మానం (Pandit Award)' చాకరోచ్ఛాస్త్రిపాదానామ్।

**గ్రంథరచనా :-**

శాస్త్రిణాం గురుభి స్తాతా సుబ్రహ్మణ్యశాస్త్రిభిః పేరి వేంకటేశ్వరశాస్త్రిభిశ్చ వ్యాకరణశాస్త్రే గ్రంథా నిర్మమిరేఇతి పూర్వమేవాకథయమ్। తయోర్గ్రంథ రచనాపాటవం తద్రీతినేమి

వృత్త్యాఽనుసరంత సూర్యనారాయణ శాస్త్రిణః వ్యాకరణ శాస్త్రే గ్రంథాన్ రచయామాసుః ।

**1. తత్త్వదర్శినీ :-**

భూషణసారస్య వ్యాఖ్యా, ఏతద్గ్రంథస్య వైశిష్ట్య ముత్తరత్ర ప్రదర్శయామః। ఏ సంగ్రంథము పాదాయైవ మమ ప్రకృతనిబంధో నిర్మిప్సితః ।

**2. నాగేశ భావప్రకాశః -**

అయం నాగేశభట్టవిరచిత లఘుమంజూషాయా ఉపరివిస్తృతో వ్యాఖ్యాన గ్రంథః। లఘుమంజూషాయా వివరణే యావంతో దర్శనాంతరీయవిషయా అపేక్ష్యంతే తే సర్వేఽపి అత్ర సంగ్రథితాః। అయం గ్రంథో భారతీయ ప్రభుత్వ నియమానురోధేన ముద్రితః।

**3. ఖండదేవ భావప్రకాశః -**

ఖండదేవేన జైమినీయ మతానుసారేణ శాబ్దబోధప్రక్రియాత్ర నిరూపితా। అత్ర ధర్మాధర్మలక్షణం, విధివాదః, భావనావాదః, ప్రథమాది సప్త విభక్తి నామర్థాః ఇత్యేతే విషయా స్సంతి। అస్య గ్రంథస్యైతావత్పర్యంతం టీకా నాస్తి। అతిప్రౌఢోఽయం గ్రంథః। నైయాయికానాం శాబ్దికానాం చ మతం నిరాకృత్య భావనా ముఖ్య విశేష్య కోశాబ్ద బోధ స్సిద్ధాంతీ కృతః। ప్రథమాది సప్తానాం విభక్తి నామర్థాః పాణినీయ సూత్రవార్తిక భాష్య ప్రదర్శన పూర్వక విచారితాః। అస్య గ్రంథస్యాశయో వినా వ్యాఖ్యయా నావగమ్యతే। సూర్య నారాయణ శాస్త్రిభిః భాట్ట రహస్యే, అయం వ్యాఖ్యాగ్రంథో నిరమాయి। టీకాయాం గ్రంథార్థ గ్రహణా యాపేక్షితా స్సర్వేఽపి విషయాః ప్రదర్శితాః॥

**4. వృత్తివిచారః —**

కృత్తద్ధితైకశేషసనాద్యంత ధాతురూప వృత్తయో విచారితాః। ఆంధ్రభాషాయాం లిఖితః గ్రంథోఽయం హైదరాబాదు నగరే సాహిత్యాకాడమీద్వారా ప్రకటీకృతః।

విజ్ఞాన సరస్వతి

**5. షడ్దర్శినీ : -**

న్యాయవైశేషికాది దర్శనానాం షణ్ణాం స్వరూపం తత్సిద్ధాంతస్వరూపం చ యథాశాస్త్రమ్ ఆంధ్రభాషయా మనూదితమ్।

**6. వాక్యపదీయమ్ : -**

అనువాదః।భర్తృహరే గ్రంథోఽయం। మహాభాష్యస్య వ్యాఖ్యారూపః కాండత్రయాత్మకః। ఏతదధ్యయనేనైవ వ్యాకరణ శాస్త్రీయ సిద్ధాంతాస్సమ్యక్ జ్ఞాయంతఇతి నిశ్చప్రచం వచః। ఆంధ్రప్రదేశ 'తెనుగు అకాదమీ' ప్రేరణయా ఆంధ్రభాషాయాం వివరివర్తితం ప్రథమకాండమ్ ఏభిః తృతీయాకాండే సప్తసముద్దేశాశ్చ।

**7. కుమార సంభవ విమర్శః : -**

అయం కుమార సంభవే విమర్శనాత్మకో గ్రంథః। అద్యత్వే కుమారసంభవే సప్తదశసర్గా విరాజంతే। పరంతు అష్టమ సర్గాంతమేవ కాళిదాసీయమితి సప్రమాణం న్యరూపి। ఏవమేవ స్ఫోటవాదాదయః అనేకేవ్యాసాః శాస్త్రిభిః ప్రకటితాః।




విజ్ఞాన సరస్వతి

[సశేషమ్]

# వాగర్థములు-కాళిదాస మహాకవి

## శ్రీ హరి లక్ష్మీ నరసింహ శర్మ

వ్యాస వాల్మీకుల తరువాత వాగ్విదాంవరుడు మహాకవి కాళిదాసు. ఈతని నామమును వినని విద్యావంతులు ఈతని మధుమయ ఫణుతుల నాస్వాదింపని రసికులు ప్రపంచమున లేరని చెప్పవచ్చును. వ్యాస వాల్మీకుల యందువలె ఈతని యందు గూడ "కవిః కవీనాం" అను పదము సార్థకమగునేమో! వేదమూర్తియగు ఈతని వాక్కులు శ్రుతిరస పూర్ణములు, రమణీయార్థ శోభితములు.

ఈ మహాకవి రఘువంశము, కుమార సంభవము, మేఘసందేశమను శ్రవ్య కావ్యములను, మాలవికాగ్నిమిత్రము విక్రమోర్వశీయము అభిజ్ఞానశాకుంతలమను మూడు దృశ్యకావ్యములను రచించెను. ఈ కావ్యములలో మొదటి కావ్యము రఘువంశము. రఘువంశ కావ్యారంభమున గల" మందః కవియశః ప్రార్థీ" ఇత్యాది ఉపోద్ఘాతరూప శ్లోకము లీ యూహకు కారణమగుచున్నవి.

రఘువంశ కావ్యము పరమేశ్వర నమస్కారముతో ప్రారంభ మగుచున్నది.
"వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే.
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ " రఘువంశ 1-1

వాగర్థముల వలె నిత్య సంపృక్తులైన పార్వతీ పరమేశ్వరులు జగత్తునకు తల్లిదండ్రులు. వాగర్థ ప్రతిపత్తి కొరకు జగత్పితరులను నమస్కరించుచున్నాను.

**"ఉపమా కాళిదాసస్య"** అనునది కాళిదాస మహాకవి యశశ్చంద్రికకు పరిమళము నందించు మంత్రవర్ణము. కాళిదాస మహాకవి ఉపమాలంకారమున సాటిలేని వాడని సామాన్యార్థము.ఉపమా శబ్దము శాస్త్ర మర్యాద ననుసరించి ఉపమాలంకార బోధకము.ఉపమీయత ఇత్యుపమా, ఆ శాస్త్రమే తత్త్వదృష్టిలో "ఉప సమీపే మా యస్య ఉపమా అను నర్థమును జిజ్ఞాసువుల కుపదేశించు చున్నది. లక్ష్మి నిరంతర మెవని యంద ధివసించు చుండునో అత "డుపమా" రూపుడగుచున్నాడు

"సక్తుమివ తితఉనా పునంతో యత్ర ధీరా మనసా వాచమక్రత అత్రా। సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి" అను ఋగ్వేద మంత్రము వాగ్విదాం

వరుల వాక్కు నందెల్లప్పుడు లక్ష్మి నివసించుచుండు నని వర్ణించు చున్నది.* అట్లు వాగ్ లక్ష్మితో నిరంతరము సుకవి కాళిదాసు ప్రకాశించుచున్నడు. ఉపమా స్వరూపుడై విరాజిల్లు కాళిదాసుని వాగ్ లక్ష్మియె ఆతని నుండి ఉపమాలంకార రూపమున ఆవిర్భవించిన ఎప్పిళ క్తి.

కాళిదాస మహాకవి రఘువంశ కావ్యమును వ్రాయబూనెను. కావ్యమునకు శబ్దార్థములు శరీరములు. ఆ శబ్దార్థ ప్రతిపత్తి నీయమని మహాకవి పార్వతీ పరమేశ్వరుల నభ్యర్థించినాడు. పిల్లలు తమకు కావలసిన వాటిని తమ తల్లిదండ్రుల నడుగుట సహజము. మహాకవి గూడ లోకమర్యాద ననుసరించి పుత్రునివలె చనువుతో జగత్పితరులను వాగర్థ ప్రతిపత్తి కలుగజేయ మని కోరుచున్నాడు. పుత్ర వాత్సల్యముతో జగత్పితరు లను గ్రహించినాడు. కాళిదాసు జగత్కవియై వర్ధిల్లినాడు. అతని ఆది కావ్యము రఘువంశము వేదకావ్య ప్రతిరూపమై వేదావతార రూపమై వైదిక మంత్రార్థ రహస్య బోధక ధర్మ సుందరియై అవతరించినది. విద్వల్లోకముచే ఆదరింపబడి అభ్యసింపబడుచున్నది.

"తం సంతః శ్రోతు మర్హంతి సదస ద్వ్యక్తిహేతవః,
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికా పి వా"
రఘువంశము స 1-10 శ్లో

అను శ్లోకము ద్వారా మహాకవి వేదవాక్యమును వలె తన రఘు వంశ కావ్యమును సత్పురుషులు శ్రవణముజేసి వాగర్థతత్త్వవిదులు కావలయు నని సూచించుచున్నాడు." తం సంతః శ్రోతు మర్హంతి" ముముక్షువులైన జిజ్ఞాసువులు శ్రవణము జేయదగిన పౌరుషేయ మంత్రరాజము రఘువంశము.

వాగర్థావివ- ఉపమావైశిష్ట్యము.

లోకమున పుణ్యదంపతులను చూచినపుడు వీరు పార్వతీ పరమేశ్వరుల వలెనున్నా రని అనుచున్నాము. పార్వతీ పరమేశ్వరులు లోకమున దంపతుల కందరకు ఉపమాన భూతులు. యథార్థమునకు వారల కుపమానభూతులెవ్వరును లేరు కాని మహాకవి తన ప్రతిభా వైదగ్ధ్యముతో వారలకు గూడ ఉపమానమును వర్ణించి విద్వజ్జన ప్రశంసలకు పాత్రుడయ్యెను. "ఉపమా కాళిదాసస్య" అను అనన్య సాధారణ-అఖండ యశస్సును సముపార్జించెను. పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహమునకు పాత్రుడయ్యెను.

వాగర్థములు-పార్వతీ పరమేశ్వరులు :-

రఘు వంశారంభమున మహాకవి పార్వతీ పరమేశ్వరుల నుతించెను. రఘువంశ గాథకు పార్వతీ పరమేశ్వరులకు ఎట్టి సంబంధము కన్పించదు. కుమార సంభవ కావ్య

* ఋగ్వేదం 10-71-2

మంతయు పార్వతీ పరమేశ్వర చరితమే, యథార్థమునకు "వాగర్థావివ" అను శ్లోకము కుమార సంభవ కావ్యారంభమున నుండుట ధర్మము యుక్తము కాని మహాకవి రఘు వంశారంభముననే పార్వతీ పరమేశ్వరుల ప్రస్తుతించెను. ఇట్లు ప్రస్తుతించుట అతని హృదయ వైశాల్యమును వాగ్విదాం వరత్వమును వాగర్థ సుస్నాతత్త్వమును తెలియజేయుచున్నది.

మహాకవి వ్రాయబూనిన దొక మధుర కావ్యము కావ్యము శబ్దార్థమయము. పార్వతి శబ్ద స్వరూపిణి, పరమేశ్వరు డర్థస్వరూపుడు.

"శివా శబ్దమయీ ప్రోక్తా అర్థ శ్చ పురుషః స్మృతః" అనియు
"శబ్దజాత మశేషం తు ధత్తే శర్వస్య వల్లభా,
అర్థరూపం య దఖిలం ధత్తే ముగ్ధేందు శేఖరః
రఘువంశ 1.1 మల్లినాథ వ్యాఖ్య(వాయు పురాణము)

అని వాయుపురాణాదు లుపదేశించుచున్నవి. వైదిక హృదయు డగు మహాకవి శబ్దార్థములను పార్వతీ పరమేశ్వరులనుగా దర్శించెను. లేక పార్వతీపరమేశ్వరులను శబ్దార్థములనుగా సాక్షాత్కరించుకొనెను. కనుకనే కవితారంభమున శబ్దార్థానన్య రూపులైన పార్వతీ పరమేశ్వరుల నుపాసించెను. ఇట్లు మహాకవి శబ్దార్థ మర్మజ్ఞు డగుటచే, కాళిదాసను అన్వర్థ నామముతో ప్రసిద్ధి జెందెను. "కాళి" యన ఉమ, శబ్ద బ్రహ్మరూపిణీ యగు వేద మాత. కాళిదాసన వేదమాతృ పాదారవింద సేవకు డని శ్రుతి మాధుర్య రసాస్వాద చణు డని అర్థము. కాళిదాస మహాకవి అట్లు శబ్దార్థ తత్త్వభావకుడు కనుకనే శబ్దార్థములను పార్వతీ పరమేశ్వరుల కుపమానముగా దర్శించెను. వెంటనే "వాగర్థావివ సంపృక్తౌ పార్వతీ పరమేశ్వరౌ" అని వారల స్తుతించెను. రఘువంశమునవలె కుమారసంభవకావ్యమున గూడ మరల పార్వతీ పరమేశ్వరుల స్మరించి తత్త్వము నుపదేశించెను "స్త్రీ పుంసా వాత్మ భాగౌ తే భిన్నమూర్తేః సిసృక్షయా, ప్రసూతి భాజః సర్గస్య తా వేవ పితరౌ స్మృతౌ"
కుమార సంభవ-2-7

వాగర్థములు - సంపృక్తములు.

వాగర్థ సంబంధము నిత్యము "నిత్యఃశబ్దార్థసంబంధః" "అని మీ మాంసక సిద్ధాంతము" అర్థమును విడచి శబ్దము గాని శబ్దమును విడచి అర్థముగాని ఉండజాలవు కనుక శబ్దార్థములు సంపృక్తములు. పార్వతీపరమేశ్వర సంబంధముగూడ నట్టిదే. కనుకనే శబ్దార్థములకు పార్వతీ పరమేశ్వరులకు ఉపమానోపమేయ భావము సంభవమైనది. యథార్థమునకు వాగర్థావివ" అనునవి రెండు పదములు.కాని ఇచట "వాగర్థావివ" అనునదేకపదముఇవ.

పదసమాసము. ఇట్లు "వాగర్థావివ" అను ఏక పదము వాగర్థ నిత్యసంబంధమును సూచించుచున్నది.

వాగర్థములు సంపృక్తములా.

అర్థమును వదిలి శబ్దము శబ్దమును వదిలి అర్థము ఉండవు గనుక శబ్దార్థములు సంపృక్తము లని చెప్పబడుచున్నవి. శబ్దార్థములు సంపృక్తము లనిన కొన్ని సందేహములు కలుగవచ్చును.

1 సంస్కృత బాషయం దొక శబ్దమున కనేకార్థము లుండును. గో శబ్దము పశువును, వాక్కును, సూర్య కిరణాదులను బోధించుచుండును. ఒక శబ్దము ఒక యర్థముతో సంబంధము కలిగి యున్నప్పుడు మరియొక అర్థముతో సంబంధముండు టెట్లు? ఒక శబ్దమన్ని అర్థములతో నిత్య సంబంధము కలిగియుండు ననిన నిత్య సంబంధముతో అన్ని చోటులం దన్ని అర్థముల నిచ్చుటలేదు: ప్రకరణానుసారమే అర్థమును చెప్పుచున్నది. ఆ సమయమున మిగిలిన అర్థ సంబంధమును వదలుకొనుచున్న దనవలెను. అట్లయిన సంపృక్తత్వ సమన్వయమెట్లు. ?

2. అట్లే ఒక యర్థము ననేక శబ్దములు బోధించుచున్నవి. సింహమునకు సింహః మృగేంద్రః పంచాస్యః ఇత్యాది నామము లెన్నియో గలవు. ఇచట అర్థ మొక్కటే. శబ్దము లనేకములు. ఒకే అర్థ మిన్ని శబ్దములతో ఎట్లు నిత్య సంబంధము కలిగి యుండును. ఒక శబ్దముతో సంపృక్తత్వమున్న వేరొక శబ్దముతో ఎట్లను సందేహము కలుగవచ్చును.

3. అట్లే ఒకే అర్థమును వివిధ బాషలు వివిధ నామములతో వ్యవహరించుచుండును. అచట సంపృక్తత్వ సమన్వయ మెట్లు?

4. ఒక శబ్దమున కిపుడున్న యర్థము కొంతకాలమునకు మారవచ్చును. అపుడు నిత్య సంబంధమెట్లు?

5. ఒక వస్తువున కొక నామమును పెట్టి అది రుచించక మరి కొంత కాలము తరువాత ఆ వస్తువునే మరియొక నామముతో పిలచు నపుడు సంపృక్తత్వము సంభవమా

6. ఒక శబ్దమునకు లోకప్రసిద్ధార్థము వేరు. వేదప్రసిద్ధార్థము వేరు. అట్టి సందర్భములలో సంపృక్తత్వ మెట్లు?

ఇట్లు వాగర్థ సంపృక్తత్వ విషయమున అనేక సందేహములు కలుగవచ్చును.అద్వైత సిద్ధాంత ప్రకారము దృశ్యమాన మగు అర్థజాత మంతయు మిథ్యారూపము. ఆ సందర్భమున సంపృక్తత్వ విచారము యుక్తమా?

వాగర్థ స్వరూపమునువిచారము చేయనంతవరకు ఇట్టి చిన్నచిన్న సందేహములు కలుగుట సహజము. వాగర్థ స్వరూపమును లోక దృష్టితోను వైదిక దృష్టితోను పరిశీలింప వలయును.

**వాగర్థ సంపృక్తత్వము - లోకదృష్టి:-**

జగత్తు పంచ భూతాత్మకము ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అను నవి పంచ భూతములు. శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు. ఈ భూత గుణములు మన యొక్క పంచ జ్ఞానేంద్రియము లీ పంచ భూతములకు సంబంధించి యున్నవి. ఈ పంచేంద్రియముల ద్వారా ఈ పంచ భూతముల స్వరూప స్వభావముల దర్శించు చున్నాము. ఇట్లు దర్శింపబడు ఈ భూతములను సంస్కృత భాష పదార్థ శబ్దముతో వ్యవహరించు చున్నది. తర్కశాస్త్రము- "ద్రవ్య-గుణ-కర్మ-సామాన్య-విశేష-సమవాయ-అభావము"లని పదార్థము లేడు విధములని చెప్పుచున్నది. ద్రవ్య గుణాదుల విభాగ విశేషాదులను తర్క శాస్త్ర పరిచయముతో వివరముగా తెలిసికొన వచ్చును. ద్రవ్య గుణాది విభాగ మెట్లున్నను సమస్త జగమును సంస్కృత భాష "పదార్థ" రూప మని వివరించు చున్నది. పదేన అర్థత ఇతి పదార్థః. జగత్తున గల ప్రతి అంశము లేక జగత్తు పదము ద్వారా తెలియబడు చున్నదని అర్థము. అనగా ప్రతి విషయము పదము ద్వారా మాత్రమే తెలియ వలసి యున్నది. పదము లేక ఏ విషయము తెలియ బడదు. దీనిని బట్టి అర్థ జ్ఞానము పదాధీన మని తెలియ వలసి యున్నది.

వేద మాత పదార్థములను "వాజినః" అని వర్ణించు చున్నది "వాక్ ఇవాః ఈశ్వరాః యేషాం తే వాజినః" [సా. భాష్య. ఋ 10-71-5]. లోక మునందలి అర్థ జాతము వాక్కే ప్రభువుగా కలిగి యుండుట వలన అర్థములు "వాజినః" అగు చున్నవి. పదార్థములనె శ్రుతి "వాజినః" అని అను చున్నది. పదమునకే వాక్కని వ్యవహారము. దీనిని బట్టి వాక్సహాయము లేక అర్థ స్వరూపమును తెలియ జాలము. ఈ విషయ మును శ్రుతి యిట్లు వివరించు చున్నది.

"తస్య వాక్తంతి ర్నామాని దామాని తస్యేదం వాచా తన్త్యా నామభి ర్దామభిః సర్వం సితం సర్వం హీదం నామనీ3 సర్వం వాచా అభివదతి" [ఐతరేయారణ్యక— 2-1-6.] సా. భాష్య.

యథా బహు బలీవర్దస్వామినః వణిజః తద్బంధనార్థా కాచిద్రజ్జుః శంకుద్వయే బద్ధా ప్రసారితా భవతి. తస్యాం రజ్జౌ ప్రత్యేకం బంధనాయ పృథ కృశా భవంతి. తథా తస్య ప్రాణస్య వా క్రంతిః శబ్ద సామాన్యం ప్రసారిత దీర్ఘ రజ్జు స్థానీయం దేవదత్త యజ్ఞదత్తాది నామాని పృథక్ పృథక్ బంధన హేతు స్థానీయాని. త త్రథా సతి అస్య ప్రాణస్య సంబంధిన్యా వాక్సామాన్య రూపయా దీర్ఘ తన్త్యా నామ విశేష రూపైః స్థామభిశ్చ సరవ మిదం స్థావర జఙ్గమ రూపం జగత్సితం బద్ధ మితి ధ్యాయేత్. సర్వం జగ దభిధేయ రూపం అభిధాయక నామని వ్యవస్థిత మితి లోక ప్రసిద్ధ మేతత్। అత ఏవ సర్వం వస్తూద్దిశ్య సర్వో।Z పురుషః వాచా త త్త న్నామ్నా అభివదతి। యదీయేన నామ్నా పురుష మాకారయతి స ఏవ పురుషః రజ్జు బంధనే నాకృష్ట ఇవ సమాగచ్ఛతి। [సాయణ భాష్య] పశుబాహుళ్యము గలవారు ఆ పశువుల నొక క్రమ మార్గమున బంధించుటకు రెండు కట్టు కొయ్యల మధ్య రజ్జువు నొక దానిని బిగించు చున్నారు. ఆ దీర్ఘ రజ్జువు నందు కట్టు త్రాళ్ళతో పశువులను బంధించు చున్నారు. ఈ విధముగ నొక రజ్జువు నందు కట్టు త్రాళ్ళతో పశువులు బంధింప బడుచున్నవి. ఇదే విధముగ ప్రాణమును పశువుల యజమానిగ తెలిసికొనవలయును. అపుడు వాక్కు శంకు ద్వయ మధ్యమున బంధింపబడిన రజ్జువగు చున్నది. లోకమున గల అర్థము లన్నియు పశువులు. ఆ అర్థమున కున్న ప్రత్యేక ప్రత్యేక నామములే వాటి కట్టుత్రాళ్ళు నామము లనెడు కట్టు త్రాళ్ళతో పదార్థము లన్నియు మహారజ్జు స్థానీయమైన వాక్కు నందు బంధింప బడియున్నవి. అనగా వాక్కు నామముల ద్వారా సమస్త ప్రపంచమును తనయందు బంధించుకొని యున్నది. కనుక సమ స్తము వాక్కుతోనే వ్యవహరించు చున్నాము.

ఈ శ్రుతి ననుసరించి మన అనుభవము ననుసరించి వాక్కు లేక అర్థ మభివ్యక్తము కాదని తెలియుచున్నది. ఈ విషయమునే భాగవత మిట్లు వ్యాఖ్యానించు చున్నది.

"యో నామభి ర్వాచి జనా న్నిజాయాం బధ్నాతి తంత్యా మివ దామభి ర్గాః,
యస్మై బలిం త ఇమే నామ కర్మ నిబంధ బద్ధా శ్చకితా వహంతి"
భాగవత-6-3-13.

"రజ్జువునందు కట్టి త్రాళ్ళతో గోవులను బంధించి నట్లు వాక్కు నందు నామములతో జనము బంధింపబడు చున్నది.

ఈ విషయమునే శ్రుతి మరియొక చోట అలంకారికముగ వర్ణించు చున్నది.
"వా గ్వై త్వష్టా -వా గ్ఘీదం సర్వం తాష్టీవ"
[ఐ. బ్రాహ్మణ-6-4 ]

విజ్ఞాన సరస్వతి

"త్వష్టా" అనగా వడ్రంగి. అతడు కొయ్యను వివిధ వస్తు రూపమున తయారు చేయు చున్నాడు. అట్లే అర్థమును జగత్తును వివిధ నామముల ద్వారా వాక్కు విభజించి విభిన్న పదార్థ రూపమున దర్శింప జేయు చున్నది. దీనిని బట్టి వాక్కుతోనే అర్థస్ఫూర్తి కలుగుచున్న దని సుస్పష్టముగ తెలియు చున్నది. కనుకనే జగత్తుకు పదార్థ వ్యవహారము సార్థక మగు చున్నది.

దండి మహాకవి ఈ విషయమునే కావ్యా దర్శమున స్పష్టీకరించు చున్నాడు.

"ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతిః ఆ చంద్రార్కం న దీప్యతే॥
కావ్యాదర్శ. 1 అ-4 శ్లో

శబ్దరూప జ్యోతిస్సు లేనపుడు జగమంధకార బంధురిత మగుచున్నది,

మరియు పదార్థములకు ఇంద్రియార్థము లని పేరు. "ఇంద్రియములచే తెలియబడు చున్నవి" ఇంద్రి యార్థములు. ఇంద్రియము లనిన "మనస్సంబంధము గలవి" యని అర్థము

"య దర్థ ప్రతి భానం త న్మన ఇత్యభిధీయతే,
అన్యత్ర కించిద ప్యస్తి న మనో నామ కించన"
"యత్ర సంకల్పనం తత్ర మనోZ స్తీ త్యవ గమ్యతామ్,
సంకల్ప మనసీ భిన్నే న కదాచన కేచన॥
[యోగ వశిష్ఠ- 3-1-1]

అర్థ ప్రతిభానమే మనస్సు.ప్రతిభాన మనగా అర్థ విషయిక జ్ఞానము. అర్థ ప్రత్యక్షము గాక మనస్స నునది వేరు లేదు. మనస్సు సంకల్ప వికల్పాత్మకము.సంకల్ప వికల్పములు మనో రూపము లేకాని వేరైనవి కావు.

ఈ యోగవాశిష్ఠ వచనము మనస్సు సంకల్ప వికల్పాత్మక మనియు సంకల్ప వికల్పములు అర్థ ప్రత్యక్ష హేతువు లని తెలియజేయు చున్నది. సంకల్ప వికల్పములు వాగ్రూపములు కనుక అర్థావ భాసము వాక్కు ద్వారా మాత్రమే కలుగు చున్నది.వాక్కు లేక అర్థావ భాసము లేదని తెలియుచున్నది.దీనిని బట్టి అర్థావ భాసమునకు వాక్కునకూ అవినాభావ సంబంధ ముండుట వలన వాగర్థములు నిత్య సంపృక్తము లగు చున్నవి.

"వాగర్థా వివ సంపృక్తౌ" అను వచన మీ విషయమునే ఉపదేశించు చున్నది. ఇంత వరకు లోక దృష్టితో వాగర్థ సంపృక్తత్వము దర్శింప బడినది.

ఇక వైదిక దృష్టితో వాగర్థ సంపృక్తత్వము దర్శించుట యుక్తమగు చున్నది. తత్త్వావ బోధకు వైదిక దృష్టియే ఆవశ్యకము. వైదిక దృష్టియే గద మానవుల తరింప జేయునది. మానవుల తరింప జేయుటకే గద వేదావతారము. కాంతా సమ్మితముగ వేదార్థమును బోధించుటకే గద కావ్యావతారము. అందులోను మహాతపస్వియగు కాళిదాస మహాకవి నుండి వెలువడిన ప్రప్రథమ వచనము మంత్ర వర్ణ కల్పమే అగుచున్నది. వాగర్థ తత్త్వ విచారము వేదార్థ విచారమే అగుచున్నది.

వాగర్థములు-పార్వతీ పరమేశ్వరులు ఉపమానుపమేయ భావము.

కాళిదాస మహాకవి పార్వతీ పరమేశ్వరులకు వాగర్థముల నుపమానముగా వర్ణించెను. ఆలంకారిక సంప్రదాయము ననుసరించి ఉపమేయము కన్న నుపమాన ముత్కృష్టమై యుండవలెను. ఉత్కృష్టమైన వారితో పోల్చినపుడే ఉపమేయ ప్రాశస్త్యము తెలియును. పార్వతీ పరమేశ్వరులు లోకోత్తర రూపులు. సర్వోపాస్యులు. అట్టి పార్వతీ పరమేశ్వరుల కుపమాన భూతులు వారి కంటె ఉత్కృష్ట రూపులై యుండుట ధర్మము, ఆవశ్యకము, శాస్త్ర సమ్మతము. ప్రకృతమున పార్వతీ పరమేశ్వరుల కుపమాన భూతము లైనవి శబ్దార్థములు, ఘట శబ్దము కుండ అను నర్థమును బోధించు చున్నది. ఈ లౌకిక శబ్దార్థములు పార్వతీ పరమేశ్వరుల కుపమాన రూపము లనిన యుక్తముగా తోచదు. ఈ ఔపమ్యము వలన పార్వతీ పరమేశ్వరులకు క్రొత్తగా వచ్చిన ప్రాశస్త్య మేమియు లేదు, ఉపమాలంకారమున కేవల సాదృశ్యము మాత్రమే పరిగణింపబడదు. ఔపమ్యౌచిత్యము ప్రధానము. నీచోపమానములో సాదృశ్యమున్ననూ ఆ ఉపమానము సహృదయ రసిక రంజకము కాదు కనుక దాని కలంకారత్వము లేదు. ప్రకృతమున లౌకిక శబ్దార్థోపమానత్వ మట్టిదే అగు చున్నది. శబ్దార్థములు నిత్యసంపృక్తము లనిన దాని వలన తెలియ వచ్చు వైదిక వశిష్ఠ మార్థము పెద్దగా కన్పించదు. కనుక మహాకవి నోటి నుండి వెడలిన "వాగర్థావివ" అను ఉపమానము ద్వారా వైదిక పరమార్థ రహస్యమును భావన జేయుట జిజ్ఞాసువుల కర్తవ్యమై యున్నది.

వాగర్థములు వాగర్థప్రతిపత్తి నామరూప వ్యాకరణము ఉపమావైశిష్ట్యము :

శ్రుతి స్మృతి పురాణేతిహాసరూప మగు ఆర్షవాఙ్మయ మంతయు జగత్స్వరూప తత్త్వరహస్యము నుపదేశించుటకే ఆవిర్భవించినది జగత్తు నామరూపాత్మకము. వేద

వేదాంతాదులకు నామరూపవ్యాకరణ మని నామాంతరము. నామ రూపాత్మకమై జగత్తు పరమేశ్వరా శన్యరూపమైనదిగా దర్శించుటయే సాధకుని లక్ష్యము.

"య చ్చ కించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతే ప్రి వా,

అంత ర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః"

అని అనిచూ శ్రుతి నామ రూపాత్మకమైన జగత్తు అనందంతయు పరమేశ్వర దత్త్వమునే దర్శించు దని ఉపదేశించు చున్నది.

"ఈశా వాస్య మిదం సర్వం య దివించి జగవ్యాం జగత్ ఈశా హస్మా పనిదతి 1-1.

"సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్యా అభివదన్ య దాస్తే" పురుష సంత్త ఇవ్యాది శ్రుతి వాక్యము లీతత్త్వమునే ఉపదేశించు చున్నవి.

"విశ్వం విష్ణు ర్వషటాలరః" అని అనుచు విష్ణు సహస్ర నామ స్తోత్రము పరమేశ్వరుని స్రప్రథమముగ విశ్వ రూపునిగ దర్శించ మని ఉపదేశించు చున్నవి. దీనిని బట్టి "పవంచ రూపమున ప్రకాశించునది పరతత్త్వ మొక్కటియే" అని తెలియుచున్నది. ఆ పరతత్త్వమునే పరమార్థము యథార్థ మని శాస్త్రము వ్యవహరించు చున్నది. పరతత్త్వము యథార్థమైనపుడు లోకమున కన్పించు అర్థములు (పదార్థములు) యధార్థములు కావని తెలియు చున్నది. మన ఇంద్రియములనే చూడబడు పంచభూతాత్మక ప్రపంచము భ్రాంతిమూలక మని శాస్త్రము ఘోషించు చున్నద. భ్రాంతి ఎప్పుడును యథార్థమును దర్శింప జేయదు. అయథార్థమునే దర్శింపజేయును. ఈ అయథార్థమునకే మిథ్యా పదార్థ మని పేరు. ఈ మిథ్యా పదంర్థమును బోధించు దాక్కనే సంస్కృత వాఙ్మయము లౌకిక వా కలని వ్యవహరించినది. లౌకిక వాకలనిన లోకసిద్ధమైన అనగా భ్రాంతి జనితమైన అర్ధమును బోధించు వాకలని అర్థము. ఈ లౌకిక వాకుల పరమార్థమును దర్శింప జేయలేదు. ఈ లౌకిక వాకుల కేవల ప్రకృతిని మాత్రము బోధించు చున్నది గాన ప్రాకృత భాష యగుచున్నది. ప్రకృతిని మాత్రము బాధించు దేశీయ భాష లన్నియు ప్రాకృత భాషలే.

"వాచారం భభం వికారో నామదేయం మృత్తిక వ్యేవ సత్యమ్" ఛాందోగ్య 6-1-4.

అను ఛాందోగ్య శ్రుతి ఈ లౌకిక భాషా స్వరూపమునే వివరించుచున్నది.

మృత్తికలో (లేక బంగారములో) వివిధ వస్తువులు చేయబడుచున్నవి. వివిధ వస్తురూపముగ నున్న దంతయు మృత్తికే వివిధా కారములలో నున్న మృత్తికె వివిధ

నామములలో వ్యవహరింప బడుచున్నది. అనగా వివిధ నామములు మృత్తికను వివిధముగా ధర్శింపజేయుచున్నది కాని అస లక్కడి యధార్థముగ నున్నది మృ కే. దీనిని బట్టి నామములు వికారమునే (అయిభ్రాన్తయినే) బోధించును కాని యధార్థ వస్తు బోధకములు కావని తెలియు చున్నది. "నామ నామైన నామ మే" తత్తిరీయం శక్యక శ్రుతి అని "పరమేశ్వరుడు నామము లన్నియు నా నామములే" అని అనుచున్నాడు. కనుక నిలనామ ములచే బోధింపబడుడం పరయేవ్వరుడే.

నామకరణము యధార్థ వస్తు దర్శనము వాగర్థప్రతిపత్తి పుట్టిన పిల్లవానికి 11వ రోజున తండ్రి నామకరణము జేయుచున్నాడు. ఈ నామకరణ మన్నిదేశము లందు జరిగినను భారతీయ నామకరణ తత్త్వము రహస్యము వేరు నామకరణమును గూర్చి ఆపస్తంబ గృహ్యసూత్ర మిట్లు పదేశించు చున్నది.

"దశమ్యా ముత్థితాయాం స్నాతాయాం పుత్రస్య నామ దధాతి పితా మాతా చ...." ఆపస్తంబ గృ. సూ. పటల-6 "పుత్రస్య పితా నామ దధాతి వ్యవస్థాపయతిన తు కరోతి శబ్దార్థయో స్సంబంధస్య నిత్యత్వాత్ మాతా చ [భాష్య]"

తల్లి దండ్రులు పుత్రునకు నామకరణము జేయునపుడు వారు క్రొత్తగా నామరచన జేయుట లేదు. నామములు సిద్ధములు. శబ్దార్థ సంబంధము నిత్యము క్రొత్తగా నామ రచన జేయుచున్నాడనిన శబ్దార్థ నిత్య సంబంధము కుదరదు. కనుక తల్లి దండ్రులు పుత్రునకు సిద్ధమైయున్న అనంత నామములలో కొక నామమును వ్యవహార సౌలభ్యము కొఱకు వ్యవస్థీకరించుచున్నారు.

నామ కరణ సందర్భమున తండ్రి కుమారుని "ఆత్మా వై పుత్ర నామా సి" అని సంబోధించుచు పుత్రుని పరమాత్మనుగా దర్శించుచున్నాడు. అనగా పరమాత్మయే తనకు పుత్రుడుగా అవతరించినట్లు భావించుచున్నాడు. అనగా తనకు జనించిన పుత్రుడు పరమాత్మ కంటె భిన్నుడు కాడని భావించుచున్నాడు. "నామ నామైవ నామ మే" (నామ మే నామ్నైవ నామ) అను శ్రుతి ననుసరించి నామము లన్నియు పరమేశ్వర నామములై తనకు జనించిన పుత్రుడు పరమేశ్వరా నన్యరూపుడే కనుక పరమేశ్వర నామములలో నొక నామము నామ కరణ సందర్భమున పుత్రునకు వ్యవస్థీకరించుచున్నాడు "ఇది భారతీయ నామ కరణ స్వరూపము.

నామము లన్నియు పరమేశ్వర నామము లని శ్రుతి మరియొక చోట ఇట్లు వివరించు చున్నది.

"మమ నామ ప్రథమం జాతవేదః పితా మాతా చ దధతు ర్యదగ్నే తత్త్వం బిభృహి పునరామదైతోః తవాహం నామ బిభరా ణ్యగ్నే" "మమ నామ తవ చ జాత వేదో దాససీ ఇవ వివసానౌ యే చరావః ఆయుషే త్వం జీవసే వయం యథాయథం వివరి దధావహే"
యజుర్వేద-1-5-10

హే జాతివేదః అగ్నే పితా మాతా చ మమ య న్నామ దధయః (న అకురుతాం) త న్నామ మమ పున రాగమన పర్యంతం త్వం బిభృహి తవ నామా హం బిభరాణి,ఏతే చ నామనీ వాససీ ఇవ వర్తేతే। యథా వాససీ విపరివృత్య ధరావః ఏత ఏవ వాససీ విపరివృత్య ధరావః ఆయుషే జీవసీ"
సౌ.భాష్య

ఓ అగ్నీ! పరమాత్మ యను నా మొదటి నామ మేది గలదో దానిని నేను వచ్చు వరకు నీవు ధరించి యుండుము. నీ నామములలో నొక నామమును వ్యవహారము కొరకు ధరింతును. మరల తిరిగి వచ్చి నా మొదటి నామమును స్వీకరించెదను. వస్త్రములను వలె మన మీ నామములను మార్చు కొందము.

పుట్టిన శిశువు అగ్నితో అను మాటల నీ మంత్రము వివరించుచున్నది. పుట్టిన శిశు వగ్నితో మాటలాడు విషయము మానవ బుద్ధి కందనిది. అతీంద్రియ విషయము-శ్రుతి ఆ అతీంద్రియ విషయమునే వివరించుచున్నది.

పరమేశ్వరుడు జీవుడుగా జనించి మరల పరమాత్మ రూపు దగుచున్నాడు. వాక్కు ఏ రూపమున నున్నను ఆ వాక్కు పరమాత్మకు సంబంధించినదే లౌకిక నామములు జీవ రూపముననున్న పరమాత్మ లక్షకములు. అనగా లౌకిక వాక్కుగా వ్యవహార దశయందున్న వాక్కు లౌకికార్థమును బోధించు చున్నట్లు కన్పించు చున్నది. తత్త్వతఃఆ వాక్కు పరమేశ్వర లక్షకమే. వైదిక వాక్కు ఆ పరమాత్మ స్వరూపమును వివరించుచు లౌకికార్థము యొక్క మిథ్యా రూపము నుపదేశించుచు తుదకు సాధకునకు మహావాక్య రూపమున తత్త్వ ముపదేశించుచు పరమాత్మ లక్షక మగుచున్నది. దీనిని బట్టి వాక్కునకు నిత్యసంబంధము పరమార్థము తోడనే యని తెలియుచున్నది.

వైదిక సంప్రదాయము ననుసరించి వాక్కనిన ప్రప్రథమమున ఓంకారము తరువాత త ద్వ్యాస రూపమైన త్రయీ రూపవేదము. వాగర్థములనిన ఓంకారము తల్లక్షక పరమార్థము అని తెలియుచున్నది. కవితారంభమున కాళిదాస మహాకవి ఉపాసించినది ఈ వాగర్థములనే. ఈ వాగర్థములే పార్వతీ పరమేశ్వరుల కుపమాన భూతములు. పార్వతి కుపమానము ఓంకారము. పరమేశ్వరున కుపమానము తల్లక్షక పరమార్థమే. ఉపమానో పమేయముల

నట్లు దర్శించినపుడే ఉపమాలంకర సార్థకత కాళిదాస మహాకవి వాగర్థ రూపులైన పార్వతీ పరమేశ్వరుల నభ్యర్థించిన వాగర్థ ప్రతిపత్తి ఈ నామరూప వ్యాకరణ రహస్యమునే. కవిత్వ రచనకు వలసిన శబ్దార్థములను (వాగర్థ ప్రతిపత్తిని) అభ్యర్థించినట్లు కన్పించినను తత్త్వతః మహాకవి అభ్యర్థించినది పురుషార్థ ప్రదమగు నామరూప వ్యాకరణ రహస్యమునే. వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థమునే.

**పురాణ గాథలు-వాగర్థ ప్రతిపత్తి**

కాళిదాసు మహాకవి అభ్యర్థించిన వాగర్థ ప్రతిపత్తినే పురాణగాథలు ప్రత్యక్షముగనో పరోక్షముగనో బోధించుచున్నవి. ఉదాహరణకు ప్రహ్లాద చరిత్ర.

పురాణ గాథలలో సుప్రసిద్ధమైనది ప్రహ్లాద చరిత్ర. ప్రహ్లాద చరితమును తెలియని లేక వినని భారతీయు లుండరు.

హిరణ్యకశిపుడు హరిద్వేషి. అతని పుత్రుడు ప్రహ్లాదుడు హరిభక్తుడు. హరిభక్తిని వీడ మని తండ్రి ఎంత చెప్పినా ఎన్ని విధముల బాధపెట్టినా ప్రహ్లాదుడు చలించడు-హరి భక్తిని వీడడు. అంతట హరి నిండియున్నాడని తండ్రికి ఉపదేశించును. "పురుష ఏవ ఇదం సర్వం" అను శ్రుతి తాత్పర్యమును వివరించి అట్లంతటా నిండియున్న పురుషుడు హరియని ప్రబోధించును. హిరణ్యకశిపు డంతట ఆ హరిని స్తంభము నందు జూపించ మని స్తంభమును బ్రద్దలు చేయును. అట నుండి నృసింహ రూపమున హరి ఆవిర్భవించి హిరణ్యకశిపుని సంహరించును.

ఈ గాథ వేదతాత్పర్యమును కాంత సమ్మితముగ చక్కగ ఉపదేశించు చున్నది. ఉన్న స్తంభమును ప్రహ్లాదుడు పరమాత్మ రూపమున దర్శించెను, హిరణ్యకశిపుడు దానిని స్తంభము గానే మొదట చూచెను. తరువాత స్తంభమునందు పరమాత్మను దర్శించెను. పరమాత్మను దర్శించ వలయు నని ప్రగాఢ జిజ్ఞాస లేనపుడు అజ్ఞానమున హిరణ్యకశిపుడు లౌకికార్థమునే స్తంభమునే దర్శించెను. జిజ్ఞాసతో దృఢ నిశ్చయముతో తదేక దృష్టితో తత్త్వ పరిశీలన జేసినపుడు అతనికి యథార్థ వస్తు సాక్షాత్కారము జరిగినది. అచట పూర్వమున్న స్తంభ భావన అంతరించినది. యథార్థ రజ్జు జ్ఞానము కలిగినపుడు భ్రాంతితో కలిగిన సర్ప జ్ఞానము నివృత్తమై పోవుచున్నది. ఇచట భ్రాంతి జనిత జ్ఞానము మిథ్యా జ్ఞానము. ఈ మిథ్యా జ్ఞానమే మిథ్యా పదార్థమే లౌకికార్థము-వాక్కు వ్యావహారిక దశ యందు లౌకికార్థమును దర్శింప జేసినను జిజ్ఞాసా భూషితునకు పరమార్థమునే దర్శింప జేయుచున్నది. ప్రహ్లాద చరిత మీ రెండు విధములగు అర్థములను- స్తంభము-పరమేశ్వరుడు

అను లౌకికార్థ-పరమార్థములను-హిరణ్యకశిపు- ప్రహ్లాదుల ద్వారా చూపించు చున్నది తుదకు స్తంభ శబ్దము తత్త్వతః తెలియునది పరమార్థ మే అని బోధించు చున్నది. హిరణ్యకశిపుడు గూడ స్తంభ శబ్దార్థము పరమేశ్వర రూప మని దర్శించెను-దీనిని బట్టి "వాక్కునకు సంపృక్తత్వము పరమార్థముతోనే" అని తెలియుచున్నది-

"యావ ద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్" (ఐతరేయారణ్యక—1-3-16) అని శ్రుతి ఈ విషయమును కంఠోక్తిగా వర్ణించు చున్నది.

పరమేశ్వరుడు విశ్వరూపమున నెంత వ్యాపించి యుండెనో వాక్కు అంత వరకు వ్యాపించి యున్నది. కనుక విశ్వవ్యాప్తమై విశ్వరూపమైన వాక్కు పరమార్థమును (బ్రహ్మను) దర్శింప జేయుచున్నది.

దీనిని బట్టి వాక్కుకు సంపృక్తత్వము యథార్థ వస్తువు తోడనే యని తెలియు చున్నది.

ఈ విషయమునే భాగవతము చక్కగా వివరించినది.

"అర్థాశ్రయత్వం శబ్దస్య ద్రష్టు లింగత్వ మేవ చ" [భాగ. 3-26-30]

"శబ్ద మర్థాశ్రయము అర్థము కాశ్రయము-ద్రష్టయగు పరమాత్మ జ్ఞాపకము"

భాగవత మిట శబ్ద లక్షణమున (వాగ్లక్షణమును) వివరించుచు వాక్కు ద్రష్టృ లింగ మని చెప్పుచు వాక్కుకు పరమార్థముతో గల నిత్య సంబంధమును బోధించు చున్నది. పరమార్థముతో నిత్య సంబంధము కలిగినపుడు వాక్కు దైవీ వాక్కగుచున్నది. అట్టి దివ్య వాక్కుతో వ్యవహరించు మానవుడు దైవ సంపదతో వెలయు చుండును.

దైవ వాక్కును "నివిత్" అని శ్రుతి వర్ణించు చున్నది.

"తాన్ పూర్వయా నివిదా హూనామహే వయం"

ఋగ్వేద-1-89-3.

పూర్వయా పూర్వకాలీనయా నివిదా వేదాత్మికయా వాచా" [సాయణ భాష్య.]

వేదవాణి అనాది నిధన పూర్వా) అమె నివి త్స్వరూపిణి. నితరాం వేదయతీతి నివిత్. లౌకికవస్తు జ్ఞానము సహజముగనే వ్యవహారమున తెలియు చుండును. ఒక వేళ తెలియక పోయిన ఇతరుల సహాయముతో తెలిసికొన వచ్చును. పరమార్థ మట్లు సులభ ముగ తెలియునది గాదు. ఎన్ని జన్మల తపః ఫలితముతో గాని అది తెలియదు. ఆ

జ్ఞానము ఎంతో సుకృత విశేషముతో గుర్వనుగ్రహాదులతో గాని తెలియదు. అట్లు గుర్వనుగ్రహముతో వెలయు మహాత్ములకు చక్కగ నిస్సందేహ సంపూర్ణముగ పూర్ణ తత్త్వము నుపదేశించు వేదవాణి "నివిత్" (నితరాం వేదయతి) అగుచున్నది-ఈ "నివిత్" అను నామము వేదమునకు పరమార్థమునకు గల సంపృక్తత్వము బోధించు చున్నది.

వేదవాణికి "సనాతనః" అని అసాధారణ నామము. "సనాత్ సతతం అనితి భక్తానుగ్రహార్థం చేష్టత ఇతి సనాతనః।" భక్తుల ననుగ్రహించి తత్త్వమును బోధించుటకు సతతము ప్రవృత్త మగు వాణి సనాతన మగుచున్నది.

సనాతన శబ్దమునకు భారత మిట్లు విలక్షణమైన అర్థమును బోధించుచున్నది.

"నాదేవ దేవ మహతా సనాతన ఇతిస్మృతః" భారత-శాంతి-209-27

నాదముతో అనగా నాదరూపుడు (నాదతను రూపుడు) అనగా ఓంకారరూపు డగు పరమాత్మతో నిత్య సన్నిహితమై వర్తిల్లు వాణి సనాతన యగుచున్నది.

వేదవాణికి గల ఈ సనాతన యను నామము గూడ వాగర్థ సంపృక్తత్వమును బోధించుచున్నది.

శ్రుతి ఈ విషయము ననేక రీతుల బోధించుచున్నది.

"జ్ఞాన స్వరూప మేవాహుః జగదేత ద్విచక్షణాః।
అర్థ స్వరూప మజ్ఞానాత్ పశ్యం త్యన్యే కదృష్టయః॥
(విష్ణుపురాణమ్.) శ్వేతాశ్వతరోపనిషత్-శంకర భాష్య- [ఉపోద్ఘాత. 1-1]

జ్ఞాన రూపు డగు పరమేశ్వరుడు విశ్వరూపముగా పసించుచున్నాడు. అ విద్యా మోహితు లగు అజ్ఞానులు ఆ పరమార్థమునే తరువృక్షాది రూపమున చూచుచున్నారుగాని పరమార్థమును దర్శించుట లేదు. దీనిని బట్టి వాక్కు తత్త్వతః బోధించునది పరమార్థమునే అని స్పష్టమగుచున్నది.

"అయథా బుద్ధి రర్థేషు బహుధా భ్రాంతి రుచ్యతే।
యథార్థాకార సంవిత్తిః విద్యేది పరికీర్త్యతే॥ తైత్తిరీయారణ్యక-3.7-6

వాక్కుచే బోదింపబడు లౌకిక ఘటపటాద్యర్థము యథార్థము గాదనియు పరమార్థమే యథార్థ మని దర్శించుటకు నిజమైన విద్య యని తైత్తిరీయారణ్యక శ్రుతి బోధించుచున్నది.

వేదవాణికి అర్థవాద మని పేరు-అర్థమును అనగా పరమార్థమును బోధించునది అర్థవాదము "అర్థం పరమార్థం బోధయతీతి అర్థవాదః—అదియే తత్త్వతః వేదార్థము.

"అర్థవాదః పరం బ్రహ్మ వేదార్థ ఇతి తం విదుః" హరివంశ 3-4-49

వేదమునకు గల ఈ అర్థవాద వ్యవహారము వాగర్థ సంపృక్తత్వమును వాగర్థప్రతి పత్తిని తత్స్వ రూపము నుపదేశించుచున్నది.

వేదవాణికి "వ్యాఖ్యాగాన" మని శాస్త్రపురాణేతిహాస ప్రసిద్ధ నామము.
"వ్యాఖ్యాగానే ష్వశక్తస్తు శివ ముద్దిశ్య భక్తితః
లౌకిక మపి వా గీతిం కుర్యా న్నిత్య మతంద్రితః॥ సూతసంహిత 4-3-113
"సంస్కృత శబ్దరూపం గద్యపద్యాత్మకం వ్యాఖ్యాగానం [విద్యారణ్య వ్యాఖ్య]

పరమేశ్వర తత్త్వవ్యాఖ్యా పకముగాన సంస్కృత వాణి వ్యాఖ్యాగాన మగుచున్నది. వ్యాఖ్యాగాన మను నామము గూడ వాగర్థ సంపృక్తత్వమును బోధించుచున్నది.

అట్టి వాగర్థ తత్త్వమునే వాగర్థప్రతి పత్తినే కాళిదాస మహా కవి కవితారంభమున జగత్పితరులను ప్రార్థించుచున్నాడు.

"అయథాబుద్ధి రద్దేషు బహుధా భ్రాంతి రుచ్యతే।

యథార్థాకార సంవిత్తిః విద్యేది పరికీర్యతే। అను అరణ్యక ప్రత్యుపదేశమునే మహా కవి వాగర్థావివ" అను శ్లోక ముఖమున అభ్యర్థించెను మహాకావ్య రచనా రూపమున మహా కవి బ్రహ్మవిద్య నుపాసింప దలచెను. ఆతని హృదయ మట్లు బ్రహ్మ విద్యాభూషిత మగు టచే అతని హృదయకుహరము నుండి ప్రప్రథమముగ "వాగర్థావివ"అను ఉపనిష త్కల్ప రూప మగు సూనృతవాక్కు ఆవిర్భవించినది.

ఈ శ్లోకమును స్థూల దృష్టితో చూచినపుడు వాగర్థము లనిన లౌకిక శబ్దార్థములే భాసించుచున్నవి అట్టి శ్లోకార్థ భావన సామాన్యముగా జరుగుచున్నది. బ్రహ్మజిజ్ఞాసా భూషితునకు వేదవాణి తత్త్వార్థము నుపదేశించినట్లు ఈ శ్లోకము గూడ జిజ్ఞాసువులగు మహాత్ములకు నామ రూప వ్యాకరణాత్మకమగు బ్రహ్మవిద్యాసారము నుపదేశించుచున్నది.

వేదాదియందు ప్రోక్త మగు స్వరమునకు అనగా ఓంకారమునకు "వాక్" అను నామము శ్రుతి ప్రసిద్ధము. నిఖిల వాఙ్మయ సమాస రూప ఓంకారమ్ కాళిదాస మహాకవిచే కవి తారంభమున "వాక్" అనుపద రూపమున నుచ్చరింపబడుచున్నది. కాళిదాస వాఙ్మయము శ్రుతికల్పము "తం సంతః శ్రోతు మర్హంతి" అని అనుచు మహాకవి తన కావ్య పవిత్రతను కళ్యాణీరూపమును సర్వమంగళాత్మకత్వమును సూచించుకొనెను వాగర్థ

స్మరణ జేయుచు తన కావ్యము వేదార్థోప బృంహక మని వ్యక్తీకరించెను ఈ వాగర్థ తత్త్వ మునే కుమార సంభవమున మరల ప్రబోధించెను.

"త మర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి ఆశోచ్యా జి పితుః కన్యా సద్భర్త్రే ప్రతిపాదితా" కుమార 6-7-9

అర్థమును భారతితో యోజనము చేసికొన మని కాళిదాస మహాకవి దివ్యోపదేశము ఇచట పరమేశ్వరు డర్థ పదముచే బోధింపబడుచున్నాడు. భారతి యన వాక్కు పామర దృష్టితో లౌకికార్థమును అర్థ మని గ్రహించవద్దు. వ్యవహారిక దశలో వ్యవహార నిమిత్త మట్లు గ్రహించినను తత్త్వ దృష్టితో అర్థ స్వరూపమును దర్శించి వాగర్థ ప్రతి పత్తి తత్త్వమును దర్శించి వాగ్విదాంవరులై పాఠకులు వర్థిల్ల, వలయు నని మహాకవి కాంతా సమ్మితముగ ప్రబోధించుచున్నాడు. మహాకవి మహోపదేశమును, వేదాంత రహస్యమును తెలిసికొని అందరు తరింతురుగాక-భారతీ రూపిణి యగు వాగ్దేవత నారంధించి భారతీయులు భారతీయులై వర్థిల్లుదురు గాక!

॥వాగర్థౌ ప్రణవార్థౌ తౌ బ్రహ్మవిద్యా స్వరూపిణీ
విశ్వరూపాత్మకా శశ్వత్ రక్షతాం సర్వమంగళా"

ఉపయుక్త గ్రంథ సూచిక

1. రఘువంశ కావ్యమ్
2. కుమార సంభవ కావ్యమ్
3. ఋగ్వేదము
4. యజుర్వేదము
5. ఐతరేయారణ్యకము
6. ఐతరేయ బ్రాహ్మణము
7. వాయుపురాణము
8. భాగవతము
9. కావ్యాదర్శ (అలంకార శాస్త్రము)
10. యోగవాశిష్ఠము
11. విష్ణుపురాణము
12. ఈశావాస్యోపనిషత్
13. పురుష సూక్తము
14. ఛాందోగ్యోపనిషత్
15. తైత్తిరీయారణ్యకము
16. ఆపస్తంబ గృహ్య సూత్రమ్
17. మహా భారతమ్
18. సూతసంహితా.

---

# కృష్ణరాయలు – ఆముక్తమాల్యదా రచనా హేతువు

శ్రీపాద రాధాకృష్ణశాస్త్రి ఎం.ఎ. ఎం.ఓ.యల్

శ్రీకృష్ణ దేవరాయలు సమరాంగణంలోనే కాక సాహిత్య రంగంలోనూ సార్వభౌముడు. తమ కాలంలో ఉత్తరాపథంనుంచి తోసుకొని వస్తున్న మహమ్మదీయుల దండయాత్రలను ఎదుర్కొని వైదిక సంస్కృతిని పరిరక్షించిన ఘనత విజయనగర సార్వభౌములకు ముఖ్యంగా కృష్ణదేవరాయలకు చెందుతుంది. తక్కిన విజయనగర సార్వభౌములవలె కాక కృష్ణదేవరాయలు కవి, పండితుడు కావడం వల్ల దేశ చరిత్రలోనూ, సాహిత్య చరిత్రలోనూ అత్యున్నత పీఠాన్ని అలంకరించాడు. కృష్ణరాయలు వింధ్యకు దక్షిణాన మహారాష్ట్ర ప్రాంతం వినా ఈశాన్య దిశగా వున్న ఉత్కళ దేశపు చివర అంచు నుండి పశ్చిమ సముద్ర తీరాన గల గోవా వరకూ, అక్కడ నుంచి కన్యాకుమారి వరకూ గల దేశమంతటిని అనగా దాదాపు దక్షిణా పథమంతటిని ఏలిన మహావీరుడు. అతని ఆస్థానాన్ని ఆంధ్ర, కర్ణాట, తమిళ, కేరళ కవిపండితులు అలంకరించినా తెలుగుపై అతనికి గల మక్కువతో తెలుగునే ఎక్కువగా అభిమానించాడు. తెలుగులోనే గొప్ప కవిగా పేరెన్నిక గన్నాడు.

భారతదేశ చరిత్రలో అశోక, సముద్ర గుప్త, హర్షవర్ధనుల వంటి చక్రవర్తులను వదిలితే కృష్ణరాయలతో పోల్చ దగినవాడు మరొకడు లేడని చెప్పవచ్చు. కృష్ణరాయల తండ్రి తుళువ నరస నాయకుడు. తల్లి నాగలాంబ. కృష్ణరాయని జనన కాలము గురించి చరిత్ర కారులు చాలా చర్చించారు. చాగంటి శేషయ్య గారు క్రీ. శ. 1487 అని వ్రాశారు.[1]

డా. ఓరుగంటి రామచంద్రయ్య గారు క్రీ. శ. 1487 ఫిబ్రవరి 16వ తేదీ అని వ్రాశారు.[2]

శ్రీ ఆరుద్ర గారు పలువురి అభిప్రాయాలను చర్చించి క్రీ. శ. 1474 ఫిబ్రవరి 10వ తేదీ అని నిర్ణయించారు.[3] ఆయన నామధేయం దక్షిణా పథమంతటికి తిరుమంత్రమైనది. "కృష్ణరాయలు ప్రజారంజకుడైన చక్రవర్తి. తమిళులు, తెలుగు వారు, కన్నడులు కూడా కృష్ణరాయలు తమ వాడని, రాయర్, రాయలు, రాయరు, అని నేటికిని ఆదరిస్తున్నారు.

.........న్యూనిజ్, పయస్ వంటి విదేశీయుల వ్రాతలు, రాయవాచకం వంటి కృష్ణరాయల దిన చర్య మనకు లభించక పోయినట్లయితే కృష్ణరాయల వ్యక్తిత్వపు వివరాలు మనకు లభించేవి కావు. ఆయన రూపు రేఖలను గురించీ, వ్యక్తిత్వాన్ని గురించీ పయస్ ఇలా అంటున్నాడు.

కృష్ణదేవరాయలు అంత పొట్టి అంత పొడుగు కాని దేహయష్టి కలవాడు. ఎర్రటి దేహకాంతి, మంచి అంగ సౌష్ఠవం కలవాడు. స్థూల కాయుడూ కాదు, కృశ శరీరుడూ కాదు. కాయవాటు మనిషి ముఖం మీద స్ఫోటకపు గుర్తులు కనిపించేవి. కృష్ణరాయలు అరిభయంకరుడు. నిజమైనరాజు. ఎప్పుడునూ వినోదంగా ఉండేవాడు. విదేశీయులను గౌర వించడం వారి యోగక్షేమాలూ, దేశ పరిస్థితులూ దయతో ప్రశ్నించడం ఆయన అలవాటు ఆయన గొప్ప పాలకుడు. గొప్ప న్యాయదృష్టి గలవాడు."4

కృష్ణదేవరాయలు సాముగరిడీలలో ఆరితేరిన వాడని గుర్రపు స్వారీలోనూ గొప్ప వాడని చరిత్ర చెపుతున్నది. పెద్దన మను చరిత్రలో ఆయన శరీర సౌష్ఠవాన్ని ఇలా వర్ణి చాడు.

శా. వ్యాయామ స్థిర సంధిబంధకట కావ్యఘాను గఘోలి కృ
త్యా(ప్యా)యగ్రావభిదా విధాభిదురుదోః ఖడ్గాగ్ర యుగ్రాపత
జ్యాయః కీర్తిభర ప్రపంచ వశవంశారామ రామా మహీ
గేయామేయ జయాంక పంకజ దృగంగీకార ధీరాకృతీ.5

రాయలు అశ్వశాస్త్ర నిపుణుడనీ నకులునితో సమానుడనీ ముక్కు తిమ్మన ప్రశం సించాడు.

శా. వాజ్యారోహణ నైపుణీనకులః రోద్యాతశుభయా కూశస
ర్వజ్యా వక్రః రజస్తమస్సయతి మిస్రాహుప. ఖన్యాల గణ
ప్రాశ్యోద్గీత యశశ్శశాంకః శశితారాతి క్షమా పాల శ
క్రాణ్యో దంచ దుదారశౌర్య హారితుగ్యాప్తా లీలా కాంతతా.6

రాయలకు చిన్న నాటి నుంచీ సంగీత సాహిత్యాలలో అభిరుచి వుండేది. బాల్యం లోనే వీణ నేర్చుకున్నాడు. తన సంగీత గురువైన కృష్ణయ్య అనే విద్వాంసుడికి ముత్యాల దండలు,వజ్రాల హారాలు బహూకరించాడు కావ్య నాటకాలంకార రహస్యాలు గ్రహించాడు. ఈ చిన్ననాటి అభిరుచే తన ఆస్థానంలోని అష్ట దిగ్గజ కవుల సత్సాంగత్యంలో అతణ్ణి ఒక గొప్ప కవిగా తీర్చి ఆంధ్ర భోజుడను ప్రశంసకు అర్హుని చేసింది.

కృష్ణదేవరాయలకు ముందు విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించిన సార్వభౌము లందరూ భారతీయ సంస్కృతికి, విదేశీయుల నుంచీ విమతుల నుంచీ హాని కలుగకుండా పోరాడిన మహావీరులే. వారి సమకాలిక మతాచార్యులు కూడా వారితో స్వమత, స్వధర్మ పరిరక్షణలో సహకరించిన వారే. కృష్ణదేవరాయల కాలంలో వైదిక మతాలే కాక, జైన-వీర-శైవాల వంటి అవైదిక మతాలు కూడా వ్యాప్తిలో వుండేవి. కృష్ణదేవరాయలు తాను వైష్ణవ మతావలంబి అయినా ఇతర మతాలను అవమానించక ఆదరించాడు. ప్రౌఢ దేవరాయల కాలం నుంచే శ్రీ వేదాంత దేశికాచార్యులు, ఆయన కుమారుడు వరదాచార్యులు విజయనగర రాజులతో వైదిక ధర్మ సంరక్షణకు తోడ్పడినందున వారి ప్రభావం విజయనగర సామ్రాజ్యం పై పడిందన వచ్చును. వేదాంత దేశికాచార్యులు విద్యారణ్యు సమకాలికులు. ఆతను విజయనగర ఆస్థానానికి రాకపోయినా పరోక్షంగా విజయనగర పాలకుల వైదిక ధర్మ రక్షణ కార్యాన్ని అన్ని విధాల సమర్థించాడు. ఈ విధంగా రాయలకు ముందే విజయనగర సామ్రాజ్యంలో శ్రీ వైష్ణవ మతానికి ప్రాబల్యం ఏర్పడింది. ఈ ప్రాబల్యం వల్లనే కృష్ణదేవరాయలు వైష్ణవ మతాచార్యులైన తాతాచార్యులకు శిష్యులై వుంటాడు. కృష్ణదేవరాయలు దక్షిణ దిగ్విజయ యాత్రకు వెళ్ళినప్పుడు అక్కడి వైష్ణవ మత వ్యాప్తి, వైష్ణవాచార్యుల నియమ నిష్ఠలు ఆయన మనస్సును ఆకర్షించి వుంటాయి. వైష్ణవాళ్వారులలో ఒకరైన ఆండాళ్ రచనలు, ఆమె జన్మస్థానమైన శ్రీవిల్లిపుత్తూరు సహజ సౌందర్యం, శ్రీరంగ నాథునిలో ఆండాళ్ ఐక్యమైన గాథ, సహృదయుడు, కవి అయిన కృష్ణదేవరాయల మనస్సును పూర్తిగా చూరగొని వుంటాయి. సహజ మధురాలైన ఆండాళ్ 'తిరుప్పావై' పాశురాలు, అతిలోక కల్పనకు ఆలవాలమైన ఆమె 'నాచ్చియార్ తిరుమొళి' అతనిని పరవశింప చేసి వుంటాయి. ఆండాళ్ కల్లకపట మెరుగని బాలిక భక్తురాలు. శ్రీ రంగడే తన భర్త అని నమ్మిన ముగ్ధ. అట్టి ముగ్ధ జీవితం ఎవరినైనా ఆకర్షిస్తుంది. అలాంటప్పుడు ధర్మ రక్షణ తత్పరుడు, వైష్ణవమతావలంబి అయిన కృష్ణరాయలను ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు. వీరశైవులలో అక్కమహాదేవి, నీలమ్మ, గొడగూచి, సంగవ్వ మొదలైన భక్తురాండ్ర జీవితాలను కృష్ణదేవరాయలు చదివే వుంటాడు. ఆండాళ్ రచనలు అక్కమహాదేవి, నీలమ్మల వచన రచనలకు దీటుగా దగినవే కాక కొన్ని ఊహలలో వాటిని మించి నట్టివి కూడా. ఆండాళ్ ప్రవర్తనలో విశిష్టత మరొకటి ఆయనకు గోచరించింది. పసిపాపలు తాము ఎవరికైనా, ఏదైనా తినుబండం ఇవ్వదలిస్తే అది బాగుందో లేదో తొలుత రుచి చూచి, ఇవ్వడం వారి మనస్తత్వం. శబరి తాను మొదట రుచి చూచి, రుచ్యమైనవని తోచిన పండ్లనే రామునికి సమర్పించినట్లు అవాల్మీకమైన కథ కూడా వ్యాప్తిలో వున్నది గదా! ఆండాళ్ రంగనాథునికి సమర్పించ దలచిన పూలదండలను తాను మొదట ధరించి, అవి బాగున్నవో లేవో నిర్ణయించుకొని పిదప రంగనాథునికి సమర్పించేదట. అందువలననే ఆమెకు 'శూడికుడుత్తనాచ్చియార్' తాను మొదట ముడుచు

కొన్ని పూల దండలను దేవునికి సమర్పించేది అనే పేరు వచ్చింది. ఈ విచిత్ర మనస్తత్వం కృష్ణరాయని మనసులో గాఢంగా నాటుకొని వుంటుంది. శ్రీవిల్లి పుత్తూరు దర్శించినప్పుడూ శ్రీరంగాన్ని సేవించినప్పుడూ, ఆండాళ్ చరిత్రను రచించాలనే ప్రగాఢవాంఛ అతనిలో మొలకెత్తి వుంటుంది. దక్షిణ దేశ విజయానంతరం విజయనగరానికి తిరిగి వచ్చేటప్పుడు ఆ మొలక ఆయన మనస్సులో రెమ్మలు కొమ్మలు వేసి మహా వృక్షమై వుంటుంది. ఈ వాంఛే ఆముక్త మాల్యాదావిర్భావానికి సమనాయకారణమై వుంటుంది. ఆ ముక్తమాల్యద కావ్యానికి విష్ణు చిత్తీయ మనేది మారు పేరు. ఈ కావ్యంలో ఆండాళ్ చరిత్రతో పాటు ఆమె తండ్రియైన విష్ణు చిత్తుని చరిత్ర కూడా వుండడం వల్ల దీనికి విష్ణు చిత్తీయ మనే పేరు వచ్చింది. ఈ కావ్యం విశిష్టా ద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించే మత గ్రంథమే కాక, కవి పండితుల ప్రతిభకు నికషోపలమైన మహాకావ్యం కూడా. చుక్కలలో చంద్రుడు లాగ ఈ కావ్యం ప్రౌఢపాండితి లోనూ, అపూర్వ కల్పనా చాతుర్యంలోనూ, విలక్షణమైన ఉత్ప్రేక్షాద్యలంకారాలలోనూ, తక్కిన తెలుగు కావ్యాలన్నిటినీ మించి విరాజిల్లు న్న దనడంలో సందేహం లేదు. ఈ కావ్యం నారికేళపాకం. చప్పరించగనే చవులూరించు ద్రాక్షవంటిదో, తొక్క తీయగనే ఆశ్వాదించ డానికనువైన కదళీ ఫలం వంటిదో కాదు. పండిత సాహాయ్యంతోనో, విశేష పరిశ్రమతోనో, ఆస్వాదించ తగినట్టిది. ఇది సులభంగానో, కొదిపాటి పరిశ్రమతోనో ఆస్వాదించ దగిన సమకాలిక కావ్యాలయిన మను చరిత్ర, పారిజాతాపహరణం మున్నగు కావ్యాల కోవలోకి రాక పరిశ్రమైక సాధ్యం కావడమే దీని విశిష్టత ముడిగా వున్నప్పుడు కాంతులీనని వజ్రం సానబెట్టినప్పుడే కదా వెలుగులు వెలార్చుతుంది. అట్లే పాండితీ పటిష్ఠమైన ఆముక్తమాల్యదను పరిశ్రమక లేనిదే ఆస్వాదించడం సాధ్యం కాదు. పరిశ్రమానంతరం కలిగే ఆస్వాదానందం అతిలోకమైనది ఏ కవులూ చూడని పెక్కింటిని కృష్ణదేవరాయలు ఎలా చూశాడు అనే ఆశ్చర్యానందాలతో పాఠకుడు తన్మయుడవుతాడు.

రాయలు కూడా స్వయంగా ప్రాచీన గ్రంథ పరిశీలన చేయడం వల్లను, ఆస్థాన పండిత గోష్ఠుల వల్లను సాహిత్య శాస్త్ర మర్మాలు గ్రహించివుంటాడు. గోదాదేవి వంటి భక్తాగ్రగణ్య జీవితం రచించ దలచాడు కనుక, ఆ రచన వైష్ణవ మత విస్తరణకూ, తన పాండిత్యపు నిగ్గుకూ సాధనం కావాలని భావించి వుంటాడు. కనుక తన విష్ణు చిత్తీయ కావ్యాన్ని నారికేళ పాకంగా రచించాడు. నిజానికి ఆయన ఉద్దేశ్యం పాండిత్య ప్రకర్ష కాదు. 'మోక్షేచ్ఛామతి' తోనే తానీ రచన చేసినట్టు కూడా ఒప్పుకున్నాడు. అది వరకు సంస్కృత భాషలో ఎన్నో రచనలు చేసినట్టు, తెలుగులో ఒక కృతి వెలయించమని శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు కలలో కనిపించి కోరినట్లు తన గ్రంథావ తారికలో పేర్కొన్నాడు.[9] వీటన్ని

టిని బట్టి కృష్ణరాయల కావ్య రచన ప్రధానోద్దేశం ఆముష్మిక చింత, విష్ణు పారమ్య ప్రకటన అని స్పష్టమవుతోంది. తాను రచించిన బ్రాసిన కావ్యంలోని పద్యాలను ఎప్పటికప్పుడు ఆస్థాన విద్వద్వరేణ్యులకు వినిపించి వారి మెప్పును పొందే వుంటాడు. స్వప్న ఉదంతాన్నే నిండోలగంలో తెలియ జేసినవాడు తన పద్యాలను నిండోలగంలో వినిపించకపోయి వుండడు కదా.

1. ఆంధ్రకవుల చరిత్ర_7 సం. పుట 16.
2. Studies on Krishna devaray of Vijayanagara P. 43.
3. సమగ్రాంధ్ర సాహిత్యం-7సం. పుట 138.
4. Vijayanagat Sexcentury Commuration Vol.p.p.181-182
5. మను చరిత్ర 6-123
6. పారిజాతాపహరణం 4-92
7. ఎపిగ్రాఫియా ఇండికా-వా-1 పుట 361
8. ఆముక్తమాల్యద-1-10
9. ఆముక్తమాల్యద 1-13
10.

# అథర్వవేదే పృథివీ సూక్త నిశామనమ్

పుప్పల. శ్రీనివాస శర్మా
యం. ఏ.,ఎం.ఫిల్

హోతా ఆహ్వయతి క్రతౌసుమనసో ఋగ్భిః సహోచ్చైస్స్వరైః
అధ్వర్యుః కరోతి యజాషాం యజ్ఞం సదాపశ్యతి।
ఉద్గాతాచ సహ సగానభణితః సామాని సంగాయతి
బ్రహ్మాఽఽభాతి అథర్వణి స్సమదృశా యజ్ఞక్రియాసూచకః॥

ఋగ్వేదః జ్ఞాన విషయ సంబంధీ. యజుర్వేదః కర్మ విషయ సంబంధీ. సామవేదః ఉపాసన విషయ సంబంధీ, అథర్వవేదే యుద్ధ శాన్త్యాది విషయాః వర్ణితాః భవన్తి. భయంకరాస్త్ర శస్త్రాణాంచ వర్ణనం దరీదృశ్యతే। ఋక్సామ యజుర్వేదాః పరంయజ్ఞ క్రియోప యోగిత్వాదౌ ప్రామాణికత్వేన అంగీకృతాః। అథర్వవేదస్తు సర్వత్రైవ యజ్ఞక్రియా సంబంధ రహితః। తథాఽపి కథంచిత్ తత్సంబంధ సంపాదన స్పృహయా తద్విషయ ప్రతిపాదకం అంతిమం కాండం తత్ర పశ్చాత్కాలే సంయోజితమ్. తత్కాండాత్ అన్యత్ర నాయంవేదో యజ్ఞసంబంధం భజతి। అథర్వవేదోఽయం అభిచారక్రియా ప్రతిపాదకం విలక్షణ విషయః। అభిచార క్రియైవాత్ర ప్రాధాన్యేనో పదిశ్యతే। తథాహి-వ్యాధయః, స్వాపదాః యాతుధానాః మాయావినః శత్రవః బ్రహ్మద్వేషిణః ఇత్యేషా మన్యేషాంచ పరిపంధినాం నివారణ స్తంభన మారణాద్యుపయుక్తా ఉపాయాః సముద్దిష్టాః। తథాపి అథర్వవేదే విరలతయా సంసారసుఖం, గ్రామవాసక్షేమం వైరప్రశమనం, దీర్ఘాయుః ఆరోగ్యం, శ్రేయః, స్వస్త్యయనం ద్యూతేదైవానుకూల్యం ఇత్యాదిక మాశంసమానాః మాంగలికాశ్చాపి కేచిన్మంత్రాః సంభవన్త్యేవ। ఇత్థంచ అథర్వవేదోఽయం నిగ్రహానుగ్రహోభయలక్షణో భవతీతి పర్యవస్యతి.

అథర్వవేదస్య పాఠద్వయ మిదానీం ఉపలభ్యతే, తత్రైకః పైప్పలాదానాం పాఠః। సచ కేవలమేకస్మిన్ భూర్జగ్రంథేఽపి ప్రాప్యతే। భూర్జగ్రంథోఽయం చిరంతనఏవ। కింత్వ పూర్ణోఽనంకిత స్వరశ్చ। సోఽయం గ్రంథః "బుహ్లరాచార్యేణ" కాశ్మీరదేశాదధిగతః। తద్విషయో వృత్తాంతః 1875 తమే క్రీస్త్వబ్దే రోథాచార్యేణ ఉపనిబద్ధశ్చ। ప్రకటీకృతం చ తస్య స్వరూపం తస్యప్రతిచ్ఛందం ప్రకాశయతా–"బ్లూంఫీల్డ్" ఆచార్యేణ। అయమేవ

మన్యామహే అథర్వవేదీయ పరిశిష్టభాగే క్వచిత్ పైప్పలాదమంత్రశబ్దేన స్మృతః పైప్పలాదానాం పాఠః। I

అపరః శౌనకానాం పాఠః। సచ "విట్నిరోటాభ్యాం" సంస్కృత్య 1856 క్రీస్తువర్షే ప్రకాశితః। అథర్వవేదోఽయం సాయణాచార్య భాష్యాలంకృతో భారతవర్షేఽపి ప్రకాశితః। తస్మిన్‌భాష్యే దర్శితా వివిధాః పాఠభేదాః "విట్నిరోటాభ్యాం" ప్రకాశితేన పాఠేన విశం వదంతి।

అథర్వవేద సంహితాయాం వింశతికాండాని, 730 సూక్తాని, ప్రాయేణ 6000 మంత్రాశ్చోపలభ్యన్తే। తత్రప్రాయేణ 1200 మంత్రాః, ఋగ్వేదాదుదాహృతాః। తేషు భూయాంసః దశమప్రథమాష్టమ మండలేభ్యః అల్పీయాంశో మండలాంతరేభ్యశ్చ ఉపాత్తాః। తత్ర వింశే కాండే సముపలభ్యమానేషు 143 ఋగ్వేదీయ సూక్తేషు, ద్వాదశ సూక్తాన్యప హాయ, అన్యాని సర్వాణ్యపి న ఋగ్వేదాను పూర్వీం జహాతి। పరంతు సంహితాంతరేష్విప అత్రాప్యేతే ఋగ్వేదపాఠాపేక్షయా జఘన్య భావం భజన్తి। అథర్వవేదోఽయం నకేవలం పద్యమయః, కింతు యజుర్వేద ఇవ భూయసా గద్య మిశ్రితః। పంచదశే,షోడశేచ కాండే స్థితాని అధికపంచశాని కాండాంతరేషు, విప్రకీర్ణాని ఉపత్రింశ-తిచ సూక్తాని గద్య వాక్యైః గ్రథితాని। అన్యేష్వపి శతాధికేషుఽపద్యమంత్రాణాం మధ్యేఽపి గద్యమంత్రాః సము పలభ్యన్తే।

అథర్వవేద ఏవ నిర్దిశ్యమానం ప్రాక్తనం తస్య నామదేయం "అథర్వాంగిరసః" ఇతి పదద్వయ ఘటితోఽయం సమస్త శబ్దోఽథర్వాంగిరః సమాఖ్యం గోత్రద్వయమభిదత్తే। "అథర్వాంగిరస" ఇత్యత్ర అధర్వశబ్దః తద్వేదభాజం, మాంగలికం, "అంగిరస" శబ్దోఽ భిచారపరం అమాంగలికం,చ భాగం పరామృశతీతి "బ్లూంపీల్డ్" ఆచార్యస్య అభిప్రాయః

బహుషు. బ్రాహ్మణ గ్రంథేషు "అథర్వాణః" మాంగలికాంశ పరతః ప్రయోగః ఉపలభ్యత ఏవ। "అథర్వా" ఇత్యేక వచన ప్రయోగస్తు ప్రథమం ఉపనిషత్సు అరబ్ధ≠ "అథర్వణాని" ఇతి తద్ధితాంత నపుంసక బహువచన ప్రయోగః, తదీయ సూక్తవివక్షయా అథర్వవేదస్యఏకోన-వింశే కాండే ప్రయుక్తః సముపలభ్యతే। తతః క్రమేణ తస్యతస్మి న్నర్థే ప్రయోగః సాధారణీ భూతః "అథర్వవేద" ఇతి వేదపదఘటిత వ్యవహారస్తు

1. వైదిక సాహిత్య చరిత్రమ్
పి.పి. సుబ్రహ్మణ్యశాస్త్రి

≠ అథర్వణానాం చతుర్చ భేభ్యః స్వాహా
—అ.వే. 19 కాం. 3 అను. 23 సూ. 1 మం.

సూత్రగ్రంథేషు ఇదం ప్రాథమ్యేన కృతః, సతు తతః ప్రాక్తన గ్రంథేషు। అపిచ సూత్ర గ్రంథేష్వపియం "త్రయా" తులామధిరోపితః దృశ్యతే। అన్యదపి అధిగమ్యతే నామదేయద్వయం అథర్వవేదస్య। తత్రైకః "భృగ్వంగిరసః" తచ్చాథర్వవేదే యజ్ఞకాండే ప్రయుక్తం ఉపలభ్యతే। తత్రభృగవోనామ గోత్రాంతరేయాః। తే అత్రఅథర్వాణాం స్థానే సమాధిష్టాః। అన్యత్ నామదేయం 'బ్రహ్మవేద' ఇతి। తచ్చ అథర్వ సంబంధి గ్రంథేషు న ప్రయుజ్యతే

## "అథర్వవేద ప్రాశస్త్యమ్"

లౌకికాచార ప్రతిపాదకేషు ధర్మశాస్త్రేషు అపి అథర్వవేదీయా ఆచారాః శిష్టత్వేనైవాభిమతాః। యతోహి సంసారిణాం అవశ్యం ఆశ్రయణీయా వేదవిద్యా జ్యోతిర్విద్యా చ వ్యక్తమేవ అథర్వవేదీయా। తద్వదభిచార ప్రయోగేన శత్రూణాం మారణోచ్చాట నాదౌ ప్రవిపిష్టత్వేన ప్రతీత ఆస్థాన పురోహితోఽపి అథర్వవేద విశారదో భవితు మర్హతి। లౌకిక వ్యవహార ప్రతిపాదకేషు ధర్మశాస్త్రేషు ఇదం ప్రాథమ్యేన శ్రూయతే అథర్వవేదవిషయిణీ నిందా। యుక్తంచ ఏతత్ యానిహి నిషేద్ధుం ఏతే ధర్మగ్రంథాః ప్రవృత్తాః, తాన్యేవ హింసాకర్మాణి అథర్వవేదీయా మంత్రాః ఉపదిశంత్వితన్న ఏతే ధర్మగ్రంథాః సహంతే। అథర్వవేదీయాన్ బహూన్ అభిచారాన్ ఏతేషూతుకాన్ మన్యంతే। అతఏవ అథర్వ వేదస్య జఘన్యత్వం తదుపదిష్టానాం ఆచారాణాం అధర్మత్వంచతేషు ఉద్ఘోషితమ్ అయ మర్థో ముక్తకంఠం "ఆపస్తంబీయే" ధర్మసూత్రే సిద్ధాంతితః అథాపి క్వచిద్విషయే అథర్వవేదీయాశ్లాఘాఽపి శ్రూయతే।

వేదేఽపి వేద చతుష్టయ నామ శ్రూయతే।

యథా:— "తస్మాత్ యజ్ఞాత్సర్వహుతః, ఋచః సామానిజజ్ఞిరే ఛందాగ్ంసి జజ్ఞిరే, తస్మాత్ యజు స్తస్మాదజాయత"

పరమేశ్వరాత్ ఋగ్వేదః యజుర్వేదః సామవేదః (ఛందః) అథర్వవేదః బహిర్నిర్గతాః। విష్ణుపురాణేఽపి సంధృశ్యన్తే అథర్వవేద విషయాః

1. అథర్వాణామథో వక్ష్యే సంహితానాం సముచ్చయమ్
అథర్వవేదం స మునిః సుమంతుర మితద్యుతిః॥
శిష్యమధ్యాపయామాస కబధంసోఽపి తంద్విధా।
కృత్వాతు దేవ దర్శాయ తథాపథ్యాయ దత్తవాన్॥
దేవ దర్శస్యశిష్యాస్తు మోదోబ్రహ్మబలిస్తథా।
శౌల్కాయనిః పిప్పలాదస్తథాన్యో ద్విజ సత్తమ॥

1 విష్ణుపురాణమ్- 3 అంశః-6-అధ్యాయః 8-14 శ్లో.

పథ్యస్యాపి త్రయ శ్శిష్యాః కృతాయైర్ద్విజ సంహితాః।
జాబాలిః కుముదాదిశ్చ తృతీయ శ్శౌనకో ద్విజ॥
శౌనకస్తు ద్విధాకృత్వా దదావే కాంతు బభ్రవే
ద్వితీయాంసంహితాం ప్రాదాత్ సైంధవాయచ సంజ్ఞినే॥
సైంధవాన్ముంజికేశశ్చ ద్వేధాభిన్నా త్రిధాపునః
నక్షత్రకల్పో వేదానాం సంహితానాం తథైవచ॥
చతుర్థ స్స్యాదంగిరస శ్శాంతి కల్పశ్చ పంచమః
శ్రేష్ఠాస్త్వ థర్వణామేతే సంహితానాం వికల్పకాః" ॥

## అథర్వవేద ప్రతిపాదక విషయాః

జ్యోతిర్విద్యా సంబంధినోఽపి కేచిద్విషయాః అథర్వవేదే వర్తన్తే। యత్తుతత్ర ఏకోనవింశే కాండే జ్యోతిషాం పరిగణనం కృతమ్। తత్ర కతిపయాని జ్యోతిర్నామాని అర్వాచీనతాం అభివ్యంజయంతి

అథర్వవేదే అభిచారికాః మంత్రాః ప్రాయేణ వివిధానాం రోగాణాం రోగోత్పాదకత్వేన తర్కితానాం భూత-ప్రేత-పిశాచ-అపస్మార-బ్రహ్మరాక్షసాదీనాంచ నివారణార్థముపయుజ్యన్తే! తథాహి-జ్వర గండమాల-రాజయక్ష్మ-నేత్రరోగ-శిరోరోగ- హృద్రోగాది వివిధమయ ఉపశాన్త్యర్థకాః శాస్త్రాద్యభిఘాత వ్రణసర్పాది విషబాధాః,చిత్తోన్మాదాది పీడా నివారణార్థకాశ్చ మంత్రాః సముపలభ్యన్తే అథర్వవేదే। ఏతేమంత్రాశ్చ తత్తద్భైషజ ఓషధి పురస్సరం ప్రయుజ్యన్తే! అతశ్చ అథర్వవేదోఽయం భారతీయ వైద్యవిద్యాయాః ప్రథమోత్పత్తిస్థానం ఇతివక్తుం పార్యతే। తతః కాసోపశాంత్యర్థకానాం మధ్యాత్ మంత్రత్రయమత్ర ఉదాహ్రియతే!

యథామనో మనస్కేతైః పరాపతత్యాశుమత్ !
ఏవా త్వం కాసే ప్రపత మనసోఽను ప్రవాయ్యమ్ ॥
యథా బాణః సుసంశితః పరాపతత్యాశుమత్!
ఏవాత్వం కాసే ప్రపత పృథివ్యా అనుసంవతమ్ ॥
యథా సూర్యస్య రశ్మయః పరాపతన్త్యాశుమత్ !
ఏవా త్వంకాసే ప్రపత సముద్రస్యాను విక్షరమ్[1] ॥

1. అథర్వవేద సంహితా 6 కాం. 106 సూ. 1 మం. 3 మం.
2. ,, 1-23-1

అయం అథస్తనోమంత్రః కృష్ణ వర్ణౌషధి ప్రయోగపూర్వకం శ్విత్రాపనోదనాయ ఉపయుజ్యమానః

నక్తం జాతాస్యోషధే రామేకృష్ణే అసిక్నిచ!
ఇదం రజని రజయ కిలాసం పలితంచయత్ [2] ॥

భూతప్రేత పిశాచ రాక్షసాదీనాం అభిచార క్రియాకారిణాం వైరిణాంచ ప్రతిక్రియార్థం బహవోఽభిచారాః ప్రవృత్తాః అధస్తనం మంత్రద్వయం యధాక్రమభిచార కారిణో వైరిణశ్చోద్దిశ్య ప్రయుక్తమభిచారమాహ -

"పరి ణో వృఙ్ధి శపథ హ్రదమగ్నిరివా దహన్ ।
శప్తారమత్ర నో జహి దివో వృక్షమివాశనిః[1]॥
యథా సూర్యో నక్షత్రాణాముద్యంస్తే జాంస్యాదదే
ఏ వా స్త్రీణాం చ పుంసాం చ ద్విషతాం వర్చ ఆ దదే[2]॥"

అనే కాని అభిచార కర్మాణి బ్రహ్మద్వేషిణో బ్రహ్మస్వాపహారిణశ్చ ఉద్దిశ్య ప్రవృత్తాని అథస్తనోమంత్రః తాదృశాం పాపాచారాణాం అనిష్టాపాదనాయ ప్రయుక్తః।

యేన మృతం స్నపయంతి శ్మశ్రూణియేనోన్దతే।
తం వై బ్రహ్మజ్య తే దేవాః అపాం భాగమధారయన్ [3]॥

ఏవం బహవో భి చారాః స్వభావ వివిధ ఔషధి చూర్ణానులేపేన పూర్వకమనుష్ఠేయే స్త్రీవశీ కరణ కర్మణి ప్రయుజ్యన్తే అథస్తానుదాహ్రియమాణః ప్రతిస్పర్థి హింసాం వినా స్త్రీవశీకరణార్థం ప్రవృత్తః—

యథేమే ద్యావాపృథివే సద్యః పర్యేతి సూర్యః ।
ఏవా పర్యేమి తే మనో యథా మాం మన్నాపగాఅసః ॥[4]
ఆధీపర్ణాం కామశల్యామిషుం సంకల్పకుల్మలామ్ ॥
తాం సుసంనతాం కృత్వా కామో విధ్యతు త్వా హృది ॥[5]

---

1. అథర్వవేద సంహితా - 6-37-2
2. " 7-13-1
3. " 5-19-14
4. " 6-8-3
5. " 3-25-2
6. " 3 11-2

అథర్వవేదేయే మాంగలికే భాగే దీర్ఘయురారోగ్య లాభాయ రోగహరణ భావాయచ
ంత్ర ప్రయోగః శ్రూయతే

యది క్షితాయుర్యది వా పరేతో యది మృత్యోరంతికం నీతఏవ ।
తమా హరామి నిర్‌ఋతే రుపస్థాదస్పార్శమేనం శతశారదాయ ॥6
ఉత్క్రామతః పురుషమావపత్థా మృత్యోః పడ్వీశమవముంచమానః ॥
మాచ్ఛిత్థా అస్మాల్లోకా దగ్నేః సూర్యస్య సంద్రుశః ॥1
అథస్తనం మంత్రద్వయం ద్యూత విజయకర్మణి ప్రయోక్తవ్యమ్ !
యథా వృక్షమశని ర్విశ్వాహా హన్త్యప్రతి :
ఏవా హమద్య కితవా నక్షై ర్బధ్యాసమప్రతి ॥2
అక్షాః ఫలవతీం ద్యువం దత్త గాం క్షీరిణీమివ ।
సం మా కృతస్య ధారయా ధనుః స్నావ్నేవ నహ్యత ॥3
అయం ఉదాహ్రియ మాణోమంత్రః సభావిజయ కామైః ప్రయోక్తవ్యః !
విద్మ తే సభే నామ నరిష్టా నామ వా అసి ।
యే తే కే చ సభాసదస్తే మే సన్తు సవాచసః ॥4

కతిపయాని సూక్తాని యజ్ఞక్రియాలోప ప్రాయశ్చిత్తపరాణి పరివేదన పాపక్షయార్థాని
ః శ్శకున దుఃస్వప్నా ద్య శుభఫల నివారణార్థానిచ సముపలభ్యన్తే

యది జాగ్రద్యది స్వపన్నేన ఏనసోఽకరమ్ ।
భూతం మా తస్మాద్భవ్యం చ ద్రుపదాదివ ముంచతామ్ ॥5
అధస్తనో మంత్రః శత్రుత్రాసనార్థకః -
ఉత్తిష్ఠత సంనహ్యధ్వముదారాః కేతుభిః సహ
సర్పా ఇతరజనా రక్షాం స్యమిత్రాననుధావత ॥
ఏవం అథర్వవేదే అనేక విషయాః వర్ణితాః భవన్తి ! అత్రచ దృష్టాంతాని.

---

1 అథర్వవేద సంహితా - 8-1.4
2 " 7-50-1
3 " 7-52-9
4 " 7-12-2
5 అ.వే.సం.6-115-2
6 అ.అ.వే.సం. 11-10-1

: అథర్వవేద సంహితా (అ.వే.12 కాం- 1అను)

విశ్వోత్పత్తి వర్ణన పరాణాం బ్రహ్మవిద్యా ప్రతిపాదన పరాణాంచ సూక్తానాం మధ్యే త్రి షష్టిమంత్రైర్ఘటితం అతిదీర్ఘ "పృథివిసూక్తమ్" చారుతమమ్। తచ్చారుతా పరీక్షాదృగేవ ఏతద్వ్యాసరచనా మార్గదర్శి! ఏతత్ పృథివీ సూక్తవివరణంచకృతం సమ్యక్ వైదికరాష్ట్ర గీతం ఇతినామ్నా శ్రీ పండిత ప్రసాద దామోదర సతావలేకర్ సుఖ ప్రకాశ్ మహోదయైః।

## పృథివిసూక్తి దేవతాది విషయకథనమ్ ≠

దేవతా = పృథివి ఋషిః-అథర్వా

త్రిష్టుప్ ² భురిక్ 4-6-1038 త్ర్యవసానాషట్పదా జగతీ, ప్రస్తారపంక్తిః 8-11, అనుష్టుప్ 12-13,మహాబృహతీ 16-21 ఇత్యాది ఛందోభిః ఉపనిబద్ధమ్ ॥

## పృథివీసూక్తోక్త విషయాః

సూక్తేఽస్మిన్ రాజ్యరక్షోపదేశః సమ్యక్కథితః। సత్యకర్మ, సత్యజ్ఞానమ్, ఆత్మ నిగ్రహః వేదాధ్యయనాది విషయాః యజ్ఞశ్చ పృథివీం ధారయంతి! అస్మాకం భూతస్య

భవస్య పదార్థ పాలనార్థం సాపృథివీ విశాలస్థానం కృణోతు ! అన్నసోమలతాది ఓషధీ విశేషయుక్తా పృథివీ అస్మాకం ఫలసిద్ధిం కుర్యాత్! మనుష్యః సముద్రనదీ కూపాది జల సంపద్యుక్తః నౌకాయాన కాలయంత్రాదియుక్తః జగతః ఉపకారం అవశ్యం కృత్వా ప్రియం కరః భవేత్, సఏవ ఆదర్శప్రాయః భవేత్, పృథివ్యాం చతస్రః ప్రదిశః అస్యాం కృష్టయః సంబభూవుః సా పృథివీ బహుధా ప్రాణదేజత్! జగత్ బిభర్తి సా అస్మాకం గవాది సంపదః స్థానం భవతి! ఉద్యోగీపురుషః సమృద్ధ్యుక్తః సుఖం లభేత్! యోమనుష్యః కౌశలేన భూమిం పాలయతి, సఃపృథివ్యాం విజ్ఞానీ, తేజస్వీ భవేత్! మనుష్యః పరాక్రమేణ పృథివ్యాః సేవా అవశ్యం కర్తవ్యాః సమదర్శీ, పరోపకారీ, మహాత్మా, దృష్టచిత్తేన. పరోపకారపరాయణో భూత్వా పృథివ్యాం అన్నాది సమస్త సంపద్యుపేతః, కీర్తనీయో భవతి, సూర్యః స్వప్రకాశేన జనానాం స్వకర్మసు రక్తిం కరోతి! యథార్థ వక్తా, యథార్థ కర్మా, యథార్థజ్ఞాతా. పురుషః, సర్వథా విజయతే! స ఏవ పృథివ్యాం ఉపయోగీభూత్వా హితకరః భవతి, మనుష్యఃనీతివిద్యా, భూగర్భవిద్యా భూతలవిద్యాది సమస్తవిషయేషు నైపుణ్యం ప్రాప్య పృథివ్యాం ఉపకారీ భవేత్! ప్రియవాక్యప్రదానేన, సత్యవచన పాలనేన,చ మనుష్యఃధర్మేణ పృథివ్యాఃశాసకోభూత్వా, ఉత్తమ గుణోపేతః,శ్రేష్ఠపదార్థయుక్తః భవేత్! పురుషార్థీ,పురుషః అనేక ప్రయత్నైః సహ,పృథివ్యాం విద్యాద్వారా సువర్ణాది సమస్త సంపత్సమృద్ధిం ప్రాప్య, తేజస్వీ భవతి! మనుష్యః పృథివీతత్వజ్ఞాననేన కార్య సాఫల్యం ప్రాప్య, ఐశ్వర్యవాన్ భవేత్! పృథివ్యాం మనుష్యః ఋతుకాలానుగుణ్యేన ఉచిత కర్మాణి కృత్వా పూర్ణాయుః భవేత్

పృథివ్యాం జితేంద్రియః వీరః పురుషః శత్రూన్ జయతి! వేదజ్ఞానీ, యోగీంద్రః పరమాత్మా", తత్త్వజ్ఞానంప్రాప్య మోక్షానందం లభతే! ఏతద్భూమౌ వయం ఇష్టసిద్ధింప్రాప్తుం కుర్మః పృథివ్యాం మనుష్యాః ఉచ్చైః మధ్యమైఃనీచైశ్చ స్వరైః గాయంతి నృత్యంతి కేచిజ్జనాః యుధ్యంతే తథాపి ధర్మాత్మా పురుషః నిర్విఘ్నేన సుఖంప్రాప్తుం శక్యతే! విద్వాన్ మనుష్యః పృథివ్యాం సువర్ణాదిశ్రేష్ఠశ్రియా ప్రసన్నచిత్తో భవేత్! పృథివ్యాం న్యాయ్యైవర్త్మని గచ్ఛన్తో జనాః సుఖినో భవేయుః!

మనుష్యః-పక్షి-వాయు-మేఘాది వివిధవిషయేషు జ్ఞానీ భవేత్! మోక్షానంద సిద్ధిం లభేత! యః మనుష్యః సంసారసంబంధవివిధ పదార్థవిజ్ఞానేన విజ్ఞానీ బుద్ధిమాన్చ భవతి! సఏవ సంసారసుఖం ప్రాప్నోతి!

విజ్ఞాన సరస్వతి

మనుష్యః సర్వదా సర్వథా సర్వాస్వపి అవస్థాసు రాజసభా న్యాయసభా ధర్మ సభాది వివిధ సందర్భేషు పృథివ్యాః మాహాత్మ్యం జ్ఞాత్వా దేశభక్తి పరో భవేత్! యో మనుష్యః ఆత్మజ్ఞానేన భాషణం ఈక్షణం కుర్వన్ ఈశ్వరనియమానుసారేణః సేవతే జనాన్, సః తేజస్వీ, వేగవాన్, శత్రువినాశకశ్చ భవేత్! ఉద్యోగీ పురుషః పరస్పరోపదేశైః పృథివ్యాం అనేకసుఖ సంపత్తిం లభతే, తదర్థం చ యతతేః మనుష్యః ప్రయత్నపూర్వకం పృథివ్యాం స్వస్థోభూత్వా, చైతన్యయుక్తో భవేత్। తథైవ తేషాం రాజ్ఞః పాలనమపి ధర్మపదం భవేత్ !

ఉత్తమ పురుషేణ, ఉత్తమశ్లోకేన, పాలనం యదా క్రియతే, తదైవ నః సుప్రతిష్ఠో భూత్వా, ఐశ్వర్యవాన్ శ్రీమాంచ భవేత్ః స ఏవ జనాన్ రంజయతి! ఏవం పృథివీ సూక్తె వర్ణిత ధర్మ నీతి విషయ పాలనేన, సాధారణ జనానాం చ రాజా, ప్రజాః, గృహస్థాశ్రమ వాసినః, సాధారణ జనాశ్చ స్వమనోరథసిద్ధిం ప్రాప్య, కళ్యాణపథిషు గచ్ఛన్తః, ఆదర ప్రాయాః స్తవనీయాశ్చ భవేయుః

## పృథివీ సూక్త సూక్తయః

| | | | |
|---|---|---|---|
| 1. | ఉరుం లోకం పృథివీ నకృణోతు | | (మంత్రః) |
| 2. | పృథివీ నః ప్రథతాం రాధ్యతాం నః | 2 | ,, |
| 3. | సా నో భూమిః పూర్వ పేయే దధాతు | 3 | ,, |
| 4. | సా నో భూమి ర్గోష్వప్యన్నే దధాతు | 4 | ,, |
| 5 | భగం వర్చః పృథివీ నో ద ధాతు | 5 | ,, |
| 6 | సా నో మధు ప్రియం దుహామ్ | 7 | ,, |
| 7 | అరణ్యం తే పృథివి స్యోనమస్తు | 11 | ,, |
| 8 | అజీతో ఽ హ తో అక్ష తోఽధ్యష్ఠాం పృథివీమహమ్ | 11 | |
| 9 | మాతా భూమిః పుత్రోZహం పృథివ్యాః | 12 | |
| 10 | పర్జన్యః పితాస ఉ నః పిపర్తు | 12 | |
| 11. | సా నో భూమిర్వర్ధయత్ వర్ధమానా । | 13. | |
| 12. | వాచో మధు పృథివి దేహి మహ్యమ్ । | 16. | |
| 13. | శివాంస్యోనామను చరేమ విశ్వహా । | 17. | |

ఏతత్ ప్రథివీ సూక్తం ధ్రువం దద్యాత్ జనానాం వృత్తౌ వృద్ధిం, చిత్తేహర్షం సంపే శక్తించ కలాయుగే। వయమువశ్యం ఆర్షకుటింబినో భూత్వా, స్వరాష్ట్రాణాం భారతదేశస్యచ ఆర్థిక, సామాజిక, సాంఘిక, రాజకీయాభ్యున్నతిం ఖండాంతరేష్వపి ఖ్యాతిం లబ్ధ్వా, "వసుదైవ కుటుంబకమితి" లో కోత్తరాహ్లాద జనక భావనయా, రాష్ట్రవందన (పృథివీ) సూక్తం పతిక్షణం స్మరన్ సంచరేమ,

ఇతిశమ్।

విశ్వశ్రేయోఖవేద్వేదః
పఠనే పాలనే ధ్రువమ్,
తత్రాప్య థర్వవేదస్తు
ప్రజాస్వామ్య ఫలప్రదః॥

—: o :—



# VIJNANA SARASWATI

A Half Yearly Oriental Reasearch Journal in Telugu
*The Andhra Pradesh Government*
*Oriental Manuscripts Library & Research Institute.*



Chief Editor
**Dr. V.V. Krishna Sastry** M A. Ph.D.
Director
**The Andhra Pradesh Government**
Oriental Manuscripts Library &
Research Institute, Hyderabad-1.

---

Volume 5
Number 3

July - December
1988